# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అన్యవాదకోలాహలము, లఘుటీక | ... | 0 | 12 |
| అధ్యాత్మరామాయణము, పద్యకావ్యము | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము | ... | 0 | 10 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 6 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు ,, | ... | 4 | 0 |
| అరణ్యపర్వము ,, | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు,, | ... | 4 | 0 |
| శాంతిపర్వము ,, | ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ఆంధ్ర శ్రీమద్రామాయణము—శ్రీ జనమంచి శేషాద్రిశర్మ గారిది ౬ సంపుటములు | ... | 15 | 0 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 3 | 0 |
| కాశీఖండము | ... | 3 | 8 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము | ... | 5 | 0 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిది | | 0 | 12 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 1 | 12 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |

# ప్రకాశక విజ్ఞప్తి

సుకవిజనాశ్రయముగు ఆంధ్రసాహిత్యపరిషత్తువారు 1917 సం॥ లో ప్రకటింపకపూర్వమే నేను దీనికిసరియగు ప్రతి వ్రాయించి తెప్పించితిని. అది నేఁడు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున 1230 అను సంఖ్యతో నున్నది. ఇంతేగాక దీనిని బ్రౌనుదొరగారు, క్రీ॥ శ॥ 1829లో ఆంగ్లేయ భాషలోనికి మూఁడధికారముల వఱకు భాషాంతరీకరించినారు. ఆ ప్రతితోను మఱికొన్నిటితోడను సరిచూచి అప్పటికే మా ప్రతిసిద్ధము చేసియుంటిమి. ఇంతటిలో సాహిత్యపరిషత్తువారు ప్రకటించుటచేత మేము తాత్కాలికముగ నా ముద్రణము నాపివేసితిని. ఆతరువాత ఛందోవ్యాకరణ గ్రంథములను తిరిగి ముద్రించుటకు తలపెట్టి ఛందోగ్రంథములలో మొదటిదియగు దీనితో ప్రారంభింప నెంచితిమి. సాహిత్యపరిషత్తువారు దీనిని తిరిగి ముద్రించెదరేమో అని చాలకాలము నిరీక్షించితిని కాని ముద్రితము కాలేదు. ఇది ప్రాచ్యవిద్యాపరీక్షలకు పఠనీయ గ్రంథమగుటచేత చాలమంది ఈగ్రంథమునకై నామీఁద వ్రాయుచు వచ్చిరి.

ఇంతేగాక ఈగ్రంథము పరిషత్తువారు వేములవాడ భీమకవి రచితముగ ముద్రించినారు. మేము వ్రాయించిన ప్రతిలో స్పష్టముగనిది నన్నెచోడదేవకృతమని యున్నది. మఱియు ననేకపద్యము లనవసరముగ నందు చేర్పఁబడియున్నవి.

ఆ పద్యములన్నియు ప్రత్యేకముగఁ జూపుచు గ్రంథవిస్తరము చేయుటకన్న సరియగు మాతృకతో ముద్రించిన నది పండితులకు విద్యార్థులకు నుపయోగకరముగ నుండునని యెంచి యీ గ్రంథమును ముద్రించి ప్రకటించినాను. క్రమముగ తక్కిన అముద్రిత-ఛందో గ్రంథములను గూడ ప్రకటించుచున్నాను.

చెన్నపట్టణము.<br>1950

ఇట్లు,<br>వావిళ్ల వేంకటేశ్వరులు.

తెనుఁగుభాషలో

# ఛందోలక్షణగ్రంథములు

తెనుఁగుభాషకూలంకషజ్ఞానసంపత్తికి ప్రాచీనసాహితీ సంప్రదాయపరిజ్ఞానమునకు నాధారములైన వ్యాకరణచ్ఛందో లక్షణగ్రంథముల విషయమై పర్యాప్తమైన పరిశీలన జరుగ లేదు. వ్యాకరణములలో తెనుఁగుభాషకు సంస్కృతభాషలో వ్రాయఁబడిన వ్యాకరణములఁగూర్చియే పరిశ్రమ జరిగినట్లుగా, ఛందోలక్షణగ్రంథములయందు సంస్కృతపరిపాటినిఁ బట్టి రచియింపఁబడిన కొన్నిగ్రంథములఁ గూర్చియే పరిశ్రమ జరిగినది. ఆగ్రంథములే విపులప్రచారమున నున్నవి. వ్యాకరణములలో ఆంధ్రశబ్దచింతామణి అథర్వణకారికావళి ఆవెనుక వాని ననుసరించి రచింపఁబడిన బాలవ్యాకరణము సర్వోసర్వత్ర ప్రమాణములై పరమాధారములైనట్లుగ ఛందోగ్రంథముల యందు క్రీ॥ శ॥ 1656 లో కాకునూరి అప్పకవి రచితమైన అప్ప కవీయము తరువాతవారికాధారమై ప్రమాణమైనది.

అప్పకవి భావికవులు,లక్షణకర్తలు,తనగ్రంథమే ప్రమాణ ముగ గైకొనునట్లు బహునిపుణముగ కట్టుదిట్టము చేసినాఁడు. లక్షణగ్రంథములు లక్ష్యోపలక్షులు గలవనియు ఒకదానికంటె వేఱొకటి విశేషము చెప్పుచుండుకతమున సకలగ్రంథములును చదువక లక్షణప్రపంచము తెలియదనియు,తనగ్రంథము చదివిన నితర గ్రంథములను చదువుబుద్ధి పొడమకుండ గ్రంథము

లన్నియు వెదకివెదకి సారమంతయు, వివరించితి ననియు వ్రాసి కొన్నాఁడు. అంతకుముందున్న ఛందోలక్షణగ్రంథములన్నింటి కంటె నిందువిషయములు విపులముగ నుండుటచేత వ్యాకరణములలో శ్రీచిన్నయసూరి బాలవ్యాకరణమువలె ఛందోగ్రంథములలో అప్పకవీయము పరమోపాదేయమై యందు చెప్పఁబడినదే వేదముగ భావించుస్థితి యేర్పడినది. లేఖకులు, తెలుఁగున ప్రాచీన కావ్యములగుభారతాదులను వ్రాసినప్పుడంతకు ముందు తమమాతృకలో నెట్లున్నను నప్పకవీయపాఠముల ననుసరించియే వ్రాయుచువచ్చిరి. ముఖ్యముగ ఛందోగ్రంథములయందప్పకవీయము పుట్టిన తరువాత మార్పులు, కూర్పులు, చేర్పులు విపరీతముగ జరిగినవి. వేయేల? కొన్నిగ్రంథముల స్వరూపమే అప్పకవీయము మార్చివైచిన దన్నచో నిక తక్కిన పాఠభేదముల సంగతియే యెత్తుకొననక్కఱలేదు. ఇంతేకాక ఆంధ్రశబ్దచింతామణి నన్నయకంటగట్టి తనవాదము నిలువఁబెట్టుకొనుటకు వేములవాడ భీమకవికి కవిజనాశ్రయకర్తృత్వము నంటగట్టి ఆయా గ్రంథముల నంతకుముం దెక్కడను కన్పట్టని పాఠముల నుదాహరించి నిరంకుశుఁడై [1]తెలుఁగు సాహిత్య ప్రపంచమున పెక్కుసమస్యలు గల్పించి కృతక మగులాక్షణిక పద్ధతి నొకదానిని నిర్మించెను.

---

1 ఈ వివరణమునుగూర్చి శ్రీ గిడుగువారి అప్పకవీయపీఠికఁ జూడుఁడు. ఇదియును శ్రీవావిళ్లవారి ప్రకటితమే. 1924. ఇంతమాత్రమున అప్పకవీయమును నిరసించితిమని తలఁపరాదు. ఆ గ్రంథము విలువ యీ తరువాత వివరింపఁబడును.

అప్పకవి నిరంకుశపద్ధతిని గూర్చియుంచి తిమ్మకవి ప్రభృతులు నిరసించి యుదారత్వముఁ జూపినను వారి గ్రంథములు విపుల ప్రచారములో లేకపోవుటచేతను అప్పకవికి పూర్వమున్న ఛందో గ్రంథములు సుపరిష్కృతములై ముద్రితములు గాకుండుట చేతను ఉపలబ్ధములగు ముద్రిత గ్రంథములలోని విషయము లైన గ్రహించు ప్రమాణబుద్ధి కేవలము లక్ష్యైకచక్షుష్కు లగు పండితులకు లేకుండుట చేతను నిర్జీవమైన కృతకసంప్రదాయమునందు మనపండితులకుఁగల అభినివేశము, సజీవమును సంప్రదాయసిద్ధమునునగు ప్రాచీనాంధ్ర భాషాసాహితీచరిత్ర యందు లేకపోవుటచేతను మనఛందోగ్రంథముల పర్యాప్తపరి శీలన లేకపోయినదని గ్రహింపఁదగును—కావున తొలుత మనము తెలుఁగుభాషయందు గల ఛందోలక్షణ గ్రంథముల వివరణము తెలిసికొనుట అత్యంతావశ్యకము.

తెలుఁగుభాషలో ఛందోలక్షణ గ్రంథములు చాలవఱకు ముద్రితములు కాలేదు. ఉన్నవానిలో రెండుమూఁడు గ్రంథ ములు తప్ప సరిగా పరిష్కరించి ప్రకటించినవి లేవు. ఈఛందో లక్షణ గ్రంథములలో శ్రీవావిళ్లవారు ప్రకటించిన గ్రంథములే అధికసంఖ్యాకములు. ఇంతకుముందు ఛందోదర్పణము, సుల క్షణసారము, ముద్దరాజు రామన కవిసంజీవని, అప్పకవీయము, కస్తూరిరంగకవి లక్షణచూడామణి-ఆనందరంగరాట్ ఛందస్సు, అడిదముసూరకవికవిసంశయవిచ్ఛేదము మున్నగులక్షణ గ్రంథము లెన్నియేని శ్రీవావిళ్లవారు ముద్రించి ప్రకటితము గావించి యున్నారు. ఇవి సర్వాంధ్ర దేశమున వ్యాప్తిగనుట ఆంధ్రవిద్వ త్కవుల కెల్ల విదితమే. ప్రాచీనాంధ్ర గ్రంథసముద్ధరణదీక్షా

దక్షు లగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు నేఁ డీఛందోలక్షణగ్రంథములను సక్రమముగ చారిత్రకపద్ధతులపైని ప్రకటింపఁబూనుట ఆంధ్రభాషాభ్యుదయహేతువని చెప్పనగును. వారికోరికపైని నే నీ ఛందోలక్షణగ్రంథములసూచికను సంకలితముగావించితిని. ప్రాజ్ఞులు మేలేర్చికొందురుగాత!

1. కవిజనాశ్రయము.—క్రీ॥ శ॥ 1100 కి పూర్వము. నేఁడు మన కుపలబ్ధము లైనగ్రంథములలో ప్రాచీనమైనది కవిజనాశ్రయము. ఇది మల్లియరేచన రచితము. జైనసాంప్రదాయికము. దీనిని వేములవాడభీమకవి కృతిగా నాంధ్రసాహిత్యపరిషత్పక్షమున క్రీ॥ శే॥ శ్రీజయంతి రామయ్యపంతులు గారు 1917లో ప్రకటించియున్నారు. ఇది కర్ణాటభాషలో నాగవర్మచే క్రీ॥ శ॥ 990 ప్రాంతమున రచిత మగుఛందోంబుధి ననుసరించి రచితమైనది. దీనిలోనుండి యొకపద్యమును మడికిసింగన సకలనీతిసమ్మతమున నుదాహరించినాఁడు. ప్రాచీనకాలమునుండి యీగ్రంథములోని పద్యములు లాక్షణికు లందఱు నుదాహరించియే యున్నారు. ఇదియే నేఁడు పునఃపరిష్కృతమై ప్రకటితమైనది. భీమనఛంద మనుపేర వెలసినది ఇదియే.

2. గోకర్ణచ్ఛందస్సు.—క్రీ॥ శ॥ 1130 ప్రాంతము. ఇది సమగ్రముగ దొరకలేదు. గౌరన లక్షణదీపికలోను అప్పకవీయమునను రంగరాట్ఛందమునను నిది యుదాహృతమై యున్నది. కావుననిది క్రీ॥ శ॥ 14 వ శతాబ్దికి పూర్వపువనుట నిశ్చయమే. క్రీ॥ శ॥ 1127 లో నున్నవర్ధమానపురాధీశ్వరుఁ డగుగోకర్ణదేవుఁడు దీనికిఁ గృతికర్తయో కృతిపతియో అగును. ఈతఁడు సూర్యవంశక్షత్రియుఁడు. తెలుఁగు చోడవంశీయుఁడు. గోకర్ణ

చ్ఛందస్సులోని "భాస్కరకులవిలసితవార్ధిచంద్ర! గోకర్ణనృపా" అనునది పై విషయమునుస్థిరపఱచుచున్నది. కావున ఈఛంద స్సును నాఁటిదే.

3. కవివాగ్బంధనము—తిక్కన సోమయాజి కృతము. 1260 ప్రాంతము. దీనిప్రతి తంజావూరి పుస్తకభాండాగారమునఁ గలదు (సంఖ్య 703). అముద్రితము-ప్రతి సమగ్రముగ లభ్య మగుచున్నది. "ఇదియే కవిసార్వభౌమచ్ఛందస్సు-సంఖ్య 1289 సమగ్రము." అని ప్రాచ్యలిఖితపుస్తక శాలలో గలదు.

4. అథర్వణచ్ఛందస్సు—అథర్వణకృతము. క్రీ॥శ॥1300 ప్రాంతము. ఇదియు సమగ్రముగ దొరకలేదు. గౌరన లక్షణ దీపికలో కొన్ని పద్యములు మాత్రమే లభ్యములు. గౌరనలక్షణ దీపికలో నుదాహరించిన కతన నిది క్రీ॥ శ॥ 1400 పూర్వపుది కావచ్చును. ఈతని భారత ముద్యోగ పర్వమునుండి పద్య మును తాతంభట్టు కవిచింతామణిలో నుదాహరించినాఁడు.

5. శ్రీధరచ్ఛందస్సు—క్రీ॥ శ॥ 1350 ప్రాంతము-శ్రీధ రునికృతము. శ్రీధరచ్ఛందస్సులో 'అరిరాయవిభాళ సోమయవ నీపాలా' అను సంబోధనమువలన నీతఁడు ఆర్వీటి రామరాజు ముత్తాత సోమభూపతికాలమువాఁ డని తెలియఁదగును. గౌరన అప్పకవి, రంగకవి, శ్రీధరుని నుదాహరించిరి. ఇందుండి కొన్ని పద్యములుమాత్రమే లభ్యములు.

6. కవిరాక్షసచ్ఛందస్సు—1330 ప్రాంతము. ఇందులోని పద్యముల నప్పకవి యుదాహరించినాఁడు—ఈతఁడు వెన్నెల కంటి జన్నయ్య దేవకీనందన శతకమునఁ బేర్కొనఁబడిన కవి

రతుశ్చైత్రేష్టుఁడైన నీకాలమువాఁడే. ఇందుండి రెండుపద్యములు మాత్రమే లభ్యములు

7. కావ్యాలంకారచూడామణి- క్రీ॥ శ॥ 1402—1407 మధ్యరచితము. విన్నకోట పెద్దనకృతి. ఇందు 9 యుల్లాసములు గలవు. అందు మొదటియాఱును నలంకారవిషయికములు. 7-8 ఛందస్సు-9 వ్యాకరణము-ఈగ్రంథములోని, 7,8,9 యుల్లాసములు తొలుత నాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటితములైనవి. గ్రంథమంతయు 1929 లో బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారిచే బూర్తిగ ప్రకటితమైనది.

8. అనంతచ్ఛందస్సు, ఛందోదర్పణము*— క్రీ॥శ॥1435. వావిళ్ల వారిచే 1921 లోఁ బ్రకటితము. నేఁడు తిరిగి వారిచేతనే ముద్రితము (1947.) ప్రసిద్ధమగు ఛందోగ్రంథము.

9. కవిగజాంకుశము—భైరవకవి. క్రీ॥శ॥1440 గణవర్ణాదుల మేలుకీడులు తెలియఁజెప్పునది. లాక్షణికులచే నుదాహృతమైనది. మూలప్రతులు రెండు తంజావూరు పుస్తకభాండారములోనివి. సంఖ్య. (696-697) ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 18 సం. సంచిక 2. 114-121 పుటలలో ముద్రితము. దీనిని ప్రత్యేకగ్రంథముగా వావిళ్లవారే ప్రకటించిరి.

10. కవిసర్పగారుడము—కాచన బసవనకృతము. క్రీ॥ శ॥ 1470 ప్రాంతము. 1550 ప్రాంతమున చిత్రకవిపెద్దన బసవనను స్తుతించినాఁడు. ఇది ప్రసిద్ధలాక్షణికోదాహృతమే. గ్రంథము పూర్తిగా లభింపకపోయినను చాలభాగము చిక్కుచున్నది.

---

* ద్వితీయముద్రణ పీఠికాకర్త, శ్రీనిడుదవోలు వెంకటరావు, ఎమ్.ఏ. ప్రథమముద్రణపీఠికాకర్త. శ్రీగిడుగు సీతాపతిగారు.

లభించునంతవఱకు ముద్రింపఁదగినది. ఆంధ్రసాహిత్యపరిషత్తున, ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునఁ బ్రతులు గలవు. (డి 1288)
ఇందులోని పద్యములు శబ్దరత్నాకరమున సుదాహృతము లైనవి.

11. ప్రయోగసారము—కాచన బసవన కృతము. ఇందు ప్రయోగములు ప్రాచీనకవులనుండి చూపఁబడినవి. అముద్రితము. వ్రాతప్రతి ఆంధ్రసాహిత్యపరిషత్తులోఁ గలదు.

12. కవిచింతామణి—వెల్లంకి తాతంభట్టకృతము. క్రీ॥ శ॥ 1450 ప్రాంతము. ఈతఁడు ప్రసిద్ధుఁడగు పండితుఁడు. కవిచింతామణి సమగ్రముగా లభించుచున్నది. శ్రీవావిళ్లవారే దీనిని ప్రకటించుచున్నారు. నాలుగధికారములుగలవు. ప్రా. పు. భా. సంఖ్య. 1278. ఈతనిదే కృతి వేఱొకటి:—

13. ఛందోదర్పణము—ఇది తంజావూరి పుస్తకశాలలో గలదు. సంఖ్య 713. ఇదియు నముద్రితము. అప్పకవీయమున దీనిని అనంతునిఛందోదర్పణమును వేఱుగాఁ జెప్పుటకే అనంతామాత్యచ్ఛంద మని, చందోదర్పణ మని స్పష్టపఱచినాఁడు. పై రెండును త్వరలో శ్రీవావిళ్లవారిచే ముద్రితములు కానున్నవి.

14. లక్షణసారసంగ్రహము—చిత్రకవి పెద్దన రచితము. క్రీ॥ శ॥ 1550 ప్రాంతము. 3 ఆశ్వాసములు. ఇందు 3 వ ఆశ్వాసమున తెనుఁగున నేలక్షణగ్రంథమున లేని నాటకలక్షణము గలదు. ఆంధ్రసాహిత్యపరిషత్పక్షమున 1937 లో పీఠికతోడఁ బ్రకటింపఁబడినది. *

* పీఠికాకర్త శ్రీ నిడుదవోలు వెంకటరావు, ఎమ్. ఏ.

15. సులక్షణసారము—లింగముగుంట తిమ్మన కృతము. క్రీ॥శ॥1560 ప్రాంతము.ఇందు ప్రాచీన గ్రంథములనుండి లక్ష్యము లనేకములు చూపఁబడినవి. ఇందులో కవితారచన కనుకూలించు ఛందోపద్ధతి సులభగ్రాహ్యముగ నుండుటచే నాభాగము క్రీ॥ శ॥ 1862 లోనే ముద్రణభాగ్యము నందినది. దానినే శ్రీ వావిళ్లవారు తక్కిన భాగమంతటితోఁగూడ సంపూర్ణముగ నేఁడు ముద్రించియున్నారు. *

16. బాలబోధచ్ఛందస్సు—ఇది యొక అపూర్వఛందో గ్రంథము. ఇప్పటి కలభ్యము లగుననేక ప్రాచీనగ్రంథము లిందుదాహృతము లైనవి. ఇది లింగముగుంట తిమ్మనకృత మని కౌలూరి ఆంజనేయకవి తన సుకవికర్ణామృతమునఁ జెప్పినాఁడు- దీనిప్రతి ఆంధ్రసాహిత్యపరిషత్తులోఁ గలదు.

17. కవిసంజీవని—ముద్దరాజు రామన. 1550 ప్రాంతము. ఇది వావిళ్లవారిచేత ముద్రితమైనది. ఇది యింకను ప్రతుల సహాయమునఁ బునర్ముద్రణము సేయఁదగినది. ముద్దరాజు పెదరామన రాఘవపాండవీయవ్యాఖ్యాత. అప్పకవి దీనినుండి 60 పద్యముల నుదాహరించెను.

18. లక్షణదీపిక—వార్తాకవి రఘునాథయ్యకృతము. 1600 ప్రాంతము. అప్పకవియు, కస్తూరిరంగకవియు దీని నుదాహరించిరి. ఇదియు వావిళ్లవారిచే ముద్రితము కానున్నది.

19. లక్షణవిలాసము—కర్తపేరు తెలియదు. 1600 ప్రాంతము. ఇది అప్పకవి యుదాహరించినది. ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్తులోఁ గలదు.

* మన్మిత్రులు విద్వాన్ శ్రీ రావూరు దొరస్వామిశర్మగారు దీని పరిష్కరించిరి.

20. మల్లన వాదాంగదచూడామణి—అసమగ్రము.

పై లక్షణగ్రంథములే కాక, కస్తూరి రంగకవి తన లక్షణచూడామణిలో యీ క్రింది దశవిధచ్ఛందో గ్రంథముల చేర్కొనినాఁడు:—

కం. "చను నుత్తమగండాథ
ర్వణ హనుమ దనంత సుకవిరాక్షస జయదే
వనుత శ్రీధర గోక
ర్ణ నీలకంఠాది భీమనచ్ఛందంబుల్".

అవి, 1. ఉత్తమగండచ్ఛందము. 2. అథర్వణచ్ఛందము. 3. హనుమచ్ఛందము. 4. అనంతచ్ఛందము. 5. కవిరాక్షసచ్ఛందము. 6. జయదేవచ్ఛందము. 7. శ్రీధరచ్ఛందము. 8. గోకర్ణచ్ఛందము. 9. నీలకంఠచ్ఛందము. 10. భీమనచ్ఛందము. అనునవి.

పై వానిలో 1. భీమన (కవిజనాశ్రయము) 2. గోకర్ణ 3. అథర్వణ 4. శ్రీధర 5. కవిరాక్షస 6. అనంతచ్ఛందస్సులను గూర్చి ముందు తెలుపబడినది. తక్కినవానిలో (౭) హనుమచ్ఛందమనగా హనుమంతుని కంకితముగాఁ జెప్పబడిన లక్షణసార సంగ్రహమని నాయభిప్రాయము. ఇది చిత్రకవిపెద్దన రచితము. (చూ. 14 సంఖ్య). హనుమంతునిపరముగ వేఱొక ఛందో గ్రంథము కానవచ్చుట లేదు. మఱియు నిది ప్రసిద్ధమైనదే.

ఉత్తమగండ చ్ఛందస్సు. ఉత్తమగండ బిరుదముగల చాళుక్యరాజున కంకితముగా రచితమైనట్లు కానవచ్చుచున్నది.

కంపరాజు హాయలక్షణసారకృతిపతి. క్రీ॥ శ॥ 1432 ప్రాంతము వాఁడు. మఱియు నిందలి పద్యములు "ఉండు ఛందాల నుత్తమగండవర్య" అనుమకుటముతో కవిసర్పగారుడమునఁ గన్పట్టుచున్నవి.

జయదేవచ్ఛందము. ఇందలిపద్యములు లక్షణగ్రంథములయం దుదాహృతములు. కవిజనాశ్రయమున నుదాహృతుఁడైన జయదేవుఁడు సంస్కృతమున ఛందశ్శాస్త్రమురచియిం చెను. అతడు చాలప్రాచీనుఁడు. క్రీస్తుశకము 1, 2 శతాబ్ద ములలో నుండునని పరిశోధకులు తెల్పుచున్నారు. ఆ సంస్కృత గ్రంథమునుబట్టి తెనుఁగున నొకలక్షణగ్రంథము రచితమై యుండును. హేమేంద్రుఁడు, కవిభల్లటుఁడు మొదలగు తెలుఁగుకవులవలె నీఛందశ్శాస్త్రరచయితయు జయదేవనామముతో గ్రంథము రచియించియుండును. ఈతనింకను గుర్తుప తగులలేదు.

నీలకంఠచ్ఛందస్సు—లక్షణగ్రంథములలో నుదాహృతము. ఈగ్రంథమునుగూర్చి గ్రంథకర్తనుగూర్చివివరములు తెలియవు. పై వానిలో కొన్ని యప్పకవీయమున నుదాహృతములగుటచే క్రీ॥ శ॥ 1656 నకు పూర్వమున వెలసినవి యగుటకు సందేహము లేదు. నీలకంఠచ్ఛందస్సు ప్రాచీనమగునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రుల వారభిప్రాయపడియున్నారు. (చూ. క్రీడాభిరామపీఠిక.) ఇవిగాక విశ్వేశ్వరచ్ఛందము మున్నగువానిని గూర్చి వివరములు తెలియరాలేదు.

21. అప్పకవీయము— క్రీ॥ శ॥ 1655. జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెమేల యనున ట్లీగ్రంథమునుగూర్చి వివ

రణ యిచ్చుట ననావశ్యకము. దీనికి వావిళ్లవారు ముద్రించి నదే ముఖ్యముద్రణము.

22. ఆంధ్రప్రయోగరత్నాకరము—గణపవరపు వేంకటకవి. క్రీ॥ శ॥ 1676. ఈ ప్రశస్తలక్షణగ్రంథమున నేఁడు మనకు లభ్యములుకాని యపూర్వగ్రంథము లుదాహృతములైనవి. ప్రస్తుతము ముద్రితమై వ్యాప్తిలో నున్న శివతత్త్వసారములో లేని పద్యము లిందున్నవన్న దీని ప్రాశస్త్యము తెలియఁగలదు. ఇది అముద్రితము. తంజావూరి పుస్తకశాలలో నున్నది. శీఘ్రముగ ముద్రణ కెక్కనున్నది.

23. లక్షణ చూడామణి లేక ఆనందరంగరాట్ఛందస్సు—కస్తూరి రంగకవికృతము క్రీ॥ శ॥ 1740--50 ప్రాంతము. ఇదియు వావిళ్లవారి ముద్రణమే. ఇందలి నవతారిక చారిత్రికముగ చాల విలువగలది. తిరిగి వివరణములతో ముద్రింపఁదగినది.

24. సర్వలక్షణసారసంగ్రహము—క్రీ॥ శ॥1740. కూచిమంచి తిమ్మకవి సార్వభౌముఁడు రచియించినది. అధునాతన లక్షణగ్రంథములలో విలువగలది. ఒక్క శ్రీనాథమహాకవి రచనలనుండి 160 ప్రయోగములు గలవు. ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము, శృంగారషష్ఠము మొదలగు నపూర్వగ్రంథము లిందుదాహృతములైనవి. ఈ వఱకు ముద్రితమైనదే కాని దీనిని సంపూర్ణముగ పరిష్కరింపఁజేసి శ్రీవావిళ్ళవారే ముద్రింప నున్నారు. అప్పు డీ గ్రంథప్రశస్తి తేటపడును.

25. కవిసంశయవిచ్ఛేదము—అడిదము సూరకవికృతము. క్రీ॥ శ॥ 1760. ఇందు తద్భవములను గూర్చి చెప్పఁబడినది. ఆ

విషయ మేలక్షణగ్రంథమునను నింత విపులముగఁ దెలుపఁ బడి యుండలేదు. దీనిని వావిళ్ళవారే ముద్రించిరి.

26. శ్రీకృష్ణభూపాలీయము—మైసూరిరాజగు శ్రీకృష్ణ రాజేంద్రవడయరున కంకితముగ చంద్రకవి రచితము. ముద్రితము. విశేషములు లేవు.

27. లక్షణవిలాసము— పెనుమర్తి వేంకటార్యుఁడు. దీనినే యతిప్రాస విలాసమని యందురు.

ఇది అముద్రితము. ఇందు పురుషార్థసారము మొదలగు పూర్వగ్రంథములనుండి పద్యము లుదాహృతములు. (సంఖ్య. ప్రా. పు. భా. 1815.)

28. వీరభూపాలీయము—క్రీ॥ శ॥ 1819. మైసూరి ప్రభువగు కళువె వీరరాజు పేర రచితము. అముద్రితము.

29. సరసాంధ్రవృత్తరత్నాకరము—వెల్లలూరి లింగన మంత్రికృతి. అముద్రితము

30. నృసింహ మాలాఖ్యదిచ్ఛందస్సు—ఇది యముద్రితము ప్రా. పు. భాలో గలదు.

31. కవితాలక్షణసారచ్ఛందస్సు—ఓరుగంటి రామకవి కృతము. ఇందు ఉదాహరణాది భేదములను గుఱించి విపులముగాఁ జెప్పఁబడినవి.*

---

*ఇవి యేలక్షణగ్రంథమునందును చెప్పబడలేదు. చూడుఁడు "ఉదాహరణవాఙ్మయ" చరిత్ర-శ్రీ నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ. పుటలు 200-210 పుటలు.

32. లక్షణశిరోమణి - పొత్తపు వేంకటరమణకవి. ఇది విపులమగులక్షణగ్రంథము. ఇందు గద్యపద్యకావ్యరచనా విధానము సమగ్రముగఁ గలదు. ఇదియును ముద్రణమునకు సిద్ధముగ నున్నది. రచనాకాలము 17 వ శతాబ్ది.

33. గరళపురీఛందస్సు - ఇది వీరభూపాలీయమునకు ప్రతిబింబము. అముద్రితము. ప్రా. పు. భాం. లోఁగలదు.

34. సకలలక్షణసారసంగ్రహము - ఉప్పులూరి వేంకటరెడ్డికృతము. అముద్రితము. విశేషములు లేవు.

35. సుకవిజనమనోరంజని. ఆంధ్రలాక్షణికచక్రవర్తి కూచిమంచి వేంకటరాయకవిప్రణీతము. ఇది అప్పకవీయమును ఖండించుచు వ్రాసిన విపులవిమర్శనాసహితమగు లక్షణగ్రంథము. ఇది ముద్రితమైన చాలవిషయములు మనకుఁ దెలియఁగలవు.[1]

పై లక్షణగ్రంథములలోఁ బ్రసిద్ధములై వ్యాప్తిలో నున్నవి తప్ప తక్కిన గ్రంథము లన్నియు నానుపూర్విగ లేక కలగూరగంపగ నున్నవి.అయినను నాయాపద్యము లే యేగ్రంథములనుండి సంకలనము గావింపబడినవో తెలిసికొనుట కాధారము లేకపోలేదు. ఈ గ్రంథము లన్నియు సంపూర్ణములైనను నసంపూర్ణములైనను తాళపత్రములమీఁద నున్నవి యథామాత్రుకముగాఁ గాగితపుప్రతులు వ్రాయించి వానిని

1 తంజావూరి పుస్తకభాండాగారమున నిట్టి ఛందస్సులభాగములు వ్రాయఁబడిన తాళపత్రగ్రంథసంకలనములు సంఖ్య 705 నుండి 712 వఱకును గలవు. ఇంకను రంగయరచించిన సర్వలక్షణసారమను బృహత్ గ్రంథము (సంఖ్య 714) గలదు. ఇందు ప్రాచీనమహాకావ్యమైన నన్నిచోడుని కుమారసంభవమునుండియుం, రంగనాథుఁడు మొదలగు ప్రాచీనకవుల శతకకృతులనుండి పెక్కుపద్యము లుదాహృతములైనవి.

సరిచూచినచో కొన్ని గ్రంథములు మనకు పూర్తిగ లభ్యములు కాకపోయినను, సంపూర్ణ గ్రంథముల యాధారమున నాయాసం పూర్ణములను నిశ్చయముగా నాయా గ్రంథములకు సంబంధించిన భాగములే యని నిర్ధరింపవచ్చును. మఱియును నేఁడు మన కుపలబ్ధములు కాని ప్రాచీనకవికృతులనుండి పద్యములు లభించును. ఇట్టిపని దేశమున మనకు లభ్యమగు ఛందోగ్రంథముల తాళపత్ర ప్రతు లన్నియు సమకూర్చినగాని కాదు. అవి మును పటికన్న లభ్యమగు నవకాశములున్నను వానిని సమీక్షించి శాస్త్రీయమైన పద్ధతులపై మూలగ్రంథమును పరిష్కరించి విపులవ్యాఖ్యానముతో ప్రకటించు నవకాశము లేసంస్థలును గలుగఁజేయలేదు. ఆంధ్రభాషాతత్త్వసాహితీసంప్రదాయపరిజ్ఞానమున కత్యావశ్యకమగు నీలక్షణగ్రంథపరిశ్రమ యెంతత్వరలో జరిగిన నంతత్వరలో తెనుఁగుభాషావిశిష్టత తేటపడును.

## కవిజనాశ్రయము

కవిజనాశ్రయము మన కుపలబ్ధము లైన ఛందోలక్షణ గ్రంథములలో ప్రాథమిక మని చెప్పనగును. ప్రసిద్ధ లక్షణవేత్త అప్పకవి, ఛందోగ్రంథకారులను పేర్కొనునప్పుడు మొదట కవిజనాశ్రయకర్త భీమననే పేర్కొనెను. "భీమన పదిచెప్పె, ననంతామాత్యుఁడు చేసె వెనుక యతులి మవదివాల్గామీఁద కొందఱు కవిగ్రామణు లిమవదియునేడు గావించి రొగిన్" అనియు,

"హారభక్తుం డగుభీమసత్కవి యనంతామాత్యునిం బెద్దసద్వరునిన్ దాతన" అనియు నిట్లు పేర్కొనుటచే నప్పకవికాలము

నుండియు నిదియే ప్రాథమికమైన ఛందోగ్రంథమని పండితలోకమున నభిప్రాయము దృఢపడినట్లు స్పష్టమగుచున్నది.

ఈ తరువాత భాషావాఙ్మయపరిశోధనముల మూలమున నప్పకవియభిప్రాయమే స్థిరపడినది. కవిజనాశ్రయము క్రీ. శ. 1300 ప్రాంతములకే సంకలనగ్రంథములందుదాహృతమైనది. అందుచే నంతకుముందే యది వెలసియుండవలయును గదా! మఱియు నీగ్రంథకర్తగా వ్యవహృతుఁడగుచున్న వేములవాడ భీమకవి కాలము కూడ నిప్పుడు మనకు నిర్వివాదముగ క్రీ. శ. 1150-1180 ప్రాంతమని స్పష్టపడినది.

మఱియు నీగ్రంథమున దోషాధికారము మొదలనున్న యీ క్రిందిపద్యము నన్నెచోడమహాకవి కుమారసంభవకావ్యమున సప్తమాశ్వాసాదియందు కొలదిమార్పులతో కన్పట్టుచున్నది.

కుమారసంభవము

శ్రీశ్రితవత్సుఁడు ముక్తి
శ్రీశ్రితసహజావదాతచిత్తుఁడు వాణీ
శ్రీశ్రితసుముఖుఁడు కీర్తి
శ్రీశ్రితదిఙ్ముఖుఁడు శేముషీనిధి పేర్మిన్.

కవిజనాశ్రయము

శ్రీశ్రితవత్సుఁడు విద్యా
శ్రీశ్రితముఖుఁడఖిలజనవిశేషితకీర్తి
శ్రీశ్రితభువనుఁడు సుకవిజ
నాశ్రయుఁ డెఱిఁగించు కృతులనగు దోషంబుల్.

ప్రాచీనజైనకన్నడ కావ్యములనుండి పదములు సమా
సములు గ్రహించిన నన్నెచోడుడు కవిజనాశ్రయమునుండియే
దీనిని గ్రహించియుండును. ఇట్టిసంవాదము లాతనిగ్రంథమున
చాల గలవు. నన్నెచోడుడు క్రీ. శ. 1130-40 ప్రాంతమువా
డగునప్పుడు కవిజనాశ్రయము క్రీ. శ. 1100 ప్రాంతముననే
వెలసినదని చెప్పుటకు వీలుకలుగుచున్నది.

కాబట్టి యీగ్రంథరచన మాకాలమునందై యుండు
ననుటలో విప్రతిపత్తి లేదు గదా!

వస్తుస్థితి యిట్లుండగా కవిజనాశ్రయము క్రీ. శ. 1330
ప్రాంతమున రచితమైన కావ్యాలంకారచూడామణి తరువాత
వెలసినదని శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రుల వారు
వ్రాయుట సరికాదని యెన్నగును.

ఈ తరువాత 1927 సం. లో పెద్దనకాలము క్రీ.శ॥ 1402
ప్రాంతమని శాసనములమూలమున స్థిరపడినది. దీనినిం బట్టి
చూచిన కవిజనాశ్రయరచనాకాల మింకను 14-వ శతాబ్ది
చివరకో పదునైదవశతాబ్ది ప్రారంభమునకో వచ్చునుగదా!
పెద్దనకాలమిట్లు స్పష్టముగానింతకాలమునుండియు తెలియు
చుండగా నీ నడుమ 1949 అప్పకవీయతృతీయాశ్వాస వివరణ
మును ప్రకటించిన శ్రీ వేదులరామశాస్త్రిగారు ఈనాడు పరా
స్తమైన శ్రీవఝ్ఝలవారికాలనిర్ణయమును ప్రమాణీకరించి కవిజనా
శ్రయము కావ్యాలంకారచూడామణి తరువాతిది యని
వ్రాయుట కరమాశ్చర్యకరమై గ్రంథకర్తృచరిత్రానభిజ్ఞతను
సూచించుచున్నది.

కవిజనాశ్రయ ప్రాచీనతను నిర్ణయించుట కింకొక యాధా
రముకూడగలదు. అఱవభాషలోఁ బండ్రెండవశతాబ్దికి పూర్వము
వెలసిన ఛందో గ్రంథములో 'యాప్పిరుంగలమ్ కారికై' అను
నది చాలప్రసిద్ధమైనది. ఇది కారికారూపముగ నున్నది. దీనికి
నొకవృత్తికూడ కలదు. అందు అఱవభాషాఛందోలక్షణగ్రంథ
ములేగాక కర్ణాటాంధ్రచ్ఛందోగ్రంథములుకూడ పేర్కొనఁ
బడియున్నవి. అందుండి మనకుఁ గావలసినభాగము నిందుదాహ
రించుచున్నాఁడను. "వీనినంతయు చరణాశ్రయమను జయదేవ
మును మిశ్రాకృతియను (మిథ్యాకృతియను) పింగళమును, మా
పింగళము, రణమూమంజూషా చంద్రకోటి చ్ఛందస్సును, గుణ
గాంకియనెడి కర్ణాటకఛందమును, *రేచి (కొ) య్యాపుశెయ్ద
వడుగచ్ఛందమును అయిన వానిలోను మాపురాణము మొద
లైన అఱవగ్రంథములలోను ప్రవేశముగలవారి నడిగి తెలుసు
కొనునది. వీనినంతయు వివరించి చెప్పినయెడల విస్తారమగును."

యాప్పరుంగళమ్. వృత్తి.
యాప్పరుంగలమ్. కారిక పుట. 490.

ఈ విషయమును తొలుత ఆంధ్రలోకమున కెఱుకపఱచి
నది కీర్తిశేషులు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు. (చూడుఁడు.
రాజరాజనరేంద్రపట్టాభిషేకసంచిక "నన్నయకుఁ బూర్వపు
ఛందస్సు" అను వ్యాసము.)

---

* పై వానిలో రేంచిమాయుశెయ్ద వడుగచ్ఛందము, 'అనునదియే
రేచనకవిజనాశ్రయము. వడుగచ్ఛందము అనఁగా తెలుఁగుఛందము. కాఁబట్టి
ఈ ఛందస్సు క్రీ. శ. 12-వ శతాబ్దికి పూర్వమే రచితమైనదని చెప్పనొప్పును-

అయితే, 12-వ శతాబ్ది కెంతకాలమునకు ముందిది రచితమైనది యని నిర్ణయించుటకుఁ గూడ మనకాధారము గలదు. కన్నడభాషలో క్రీ. శ॥ 990 ప్రాంతములలో కవిరాజ కలహంస బిరుదాంకితుఁడగు నాగవర్మ 'ఛందోంబుధి' యను కన్నడలక్షణగ్రంథమును రచియించియున్నాఁడు. ఇది కన్నడ భాషాలక్షణగ్రంథములలో ప్రశస్తమైనది. ప్రాథమికమైనది.

ఈ రెండింటికిఁ బోలికలు చూపుచున్నాఁడను.

## కవిజనాశ్రయము

ప్రథమ.—సంజ్ఞాధికారము.

ద్వితీయ.—సమవృత్తాధికారము - వియతిచ్ఛందోఽధికారము. యతిచ్ఛందోధికారము. ఉద్ధర మాలావృత్తములు. దండకము. అర్ధసమవృత్తములు.

తృతీయ.—జాత్యధికారము. కందాది మాత్రావృత్తములు. తెనుఁగు విషయజాతివృత్తప్రకరణము.

చతుర్థ.—షట్ప్రత్యయాధికారము.

పంచమ.—దోషాధికారము.

## నాగవర్మ ఛందోంబుధి

ప్రథమ.—సంజ్ఞాప్రకరణము

ద్వితీయా.—సమవృత్తము

తృతీయ.—మాలావృత్తము (ఉద్ధరమాలా వృత్తములు) అర్ధసమవృత్తము. అనుష్టుప్వృత్తము

విషమాదివృత్తము.—వైతాళీయము, రఘటా లక్షణము, దండకము

చతుర్థ.—జాతిప్రకరణము. కందాదిమాత్రావృత్తములు

పంచమ.—కర్ణాటవిషయజాతివృత్తప్రకరణము

షష్ఠ.—షట్ప్రత్యయవివరణము.

కవిజనాశ్రయరచయిత, నాగవర్మ ఛందస్సును ననుసరించి రచియించిన ట్లీక్రిందియుదాహృతులనుబట్టి నిర్ణయింపవచ్చును.

క. జయదేవాదిచ్ఛందో
నయమునసంక్షేపరూపునం జెలువుగ మ,
ల్లియరేచన సుకవిజనా
శ్రయుఁడీ ఛందంబుఁ జెప్పె జనులకు నొనరన్.

కవిజనాశ్రయము (గ్రంథాంతము.)

మఱియు నాగవర్మ జయదేవుని నుతియించినాఁడు.

నాగవర్మ:—చంధోంబుధి షష్ఠాధికారము మొదలు.

క. జయదేవాద్యరఛందో
న్వయప్రయోగతరమూదుపం పేరటం ని
ర్ణయమాగిర లింపప్ర
త్యయముం జెల్వాగెపేర్వ నంబుజవదనే!

ఇంకను జాత్యధికారమున కంద త్రిపదలక్షణములలో చంధోంబుధితోఁ బోలికలుగలవు. దోషాధికారమున కవిరాజమార్గమున బోలికలు గలవు.

పై విషయములఁ బరిశీలించి చూచినచో కవిజనాశ్రయము 10—12 శతాబ్దముల మధ్యననగా క్రీ. శ. 1100 ప్రాంతముల రచితమైనట్లు నిర్ణయింపవచ్చును.

మఱియు కవిజనాశ్రయములోని ఈ క్రిందిపద్యము మడికి సింగన సకలనీతి సమ్మతములో వేర్కొనబడినది.

క. అమరంగ వేల్పులచేఁ గ
బ్బము సెప్పియు కాదె వరమువడసిరి మును బా
ణమయూరాదులు సత్కా
వ్యము సెప్పినఁ బడయరాని వస్తువు గలదే?
(సంజ్ఞాధికారము.) పుట. 3.

(మాఘుఁడు. సకలనీతి సమ్మతము)

మడిగిసింగన క్రీ. శ. 1400 ప్రాంతమువాఁడు. దీనిని బట్టిచూచినను, ఈగ్రంథము 13-వ శతాబ్ది వెనుకకురాదు.

భీమకవి ప్రాచీనుఁడని చెప్పువారి కాధారము అప్పకవీయమునందలి.

" భీమన పదిచెప్పె ననం
తామాత్యుఁడు చెప్పె వెనుక యతు లిరువదినాల్గు"

అనుపద్యమేయయిన, ఈ పదియతులు నన్నిప్రతులయందు లేవు కావున అప్పకవీయము రచితమైననాటినుండి, యిందును నా పది యెక్కినవని తలంచుట సమంజసము. ఆకాలమునకు లక్ష్యముగా వెలసిన నన్నయ భారతములో నందులో చెప్పబడిన ప్రాదియతులు, శకంధ్వాదియతులు, అఖండయతులు మున్నగునవి లేవు. కావున అప్పకవికి పూర్వము లిఖితములైన కవిజనాశ్రయప్రతులే ప్రమాణము. వానిలో కొన్ని నేఁడులభించుచున్నందున నేటి ముద్రణమునం దివి ప్రక్షిప్తములుగా చూపబడినవి. కానసీవిషయము భీమకవి ప్రాచీనతను సమర్థింపఁజాలదు.

చంధో గ్రంథములలో నేమి, కావ్యములలో నేమి ప్రాచీనరచనలలో నేమి, రచనలు మిక్కిలి యిమిడికగలిగియుండి, సూత్రప్రాయములై యుండును. కవిజనాశ్రయరచన మట్టిది గావుననే, తరువాత ఛందోగ్రంథము లన్నింటియం దిది యెక్కినది. దానిచేతనే దీనిస్వరూపము నిర్ణయించుట మిక్కిలి దుస్సాధ్యమైనకార్యము.

బహుముఖములుగా లక్షణగ్రంథములలో చెదఱి యున్న నిందులోని పద్యముల గుర్తించియు, వ్రాతప్రతుల లోని పాఠములు సరిచూచియు దీనిని సవరించుట మిగుల ప్రయాసకరమైనది.

ఇందులోని అర్ధసమవృత్తాధికారమును ముఖ్యముగా పరిశీలించినయెడల దీనినెంతజాగ్రత్తగపరిశోధించి నది తేటపడక మానదు. ఇప్పటి కీగ్రంథమున కొక సరియగురూప మేర్పడినదని, అది చాలా ప్రామాణికముగ నిర్వహింపఁబడినదని చెప్పుట కేమాత్రము సందేహము లేదు. ప్రస్తుత మీ ఛందస్సుఁగూర్చి కొన్ని ముఖ్యవిషయముల నిందు క్రోడీకరించుచున్నాను.

1 ఇది తెలుగు చ్ఛందస్సులలో ప్రాచీనమైనది.

2 తెనుఁగున జైనసంప్రదాయములను దెలుపు గ్రంథములలో నిది యొకటి.

3 క్రీ. శ. 517 ప్రాంతము వాఁడగు విష్ణుకుండిన మాధవ వర్మ (జనాశ్రయి) రచితమగు జనాశ్రయిచ్ఛందము దీనికి మూలమనఁదగును.

4 కన్నడ నాగవర్మ చ్ఛందస్సునకు దీనికి సామ్యములు గలవు.

5 ఇందు మాత్రాచ్ఛందస్సులలో రగడల గూర్చి ప్రస్తావన లేదు. అప్పటికి కావ్యములలోనివి చేరకపోవుటయే కారణము.

6 ఇందు పూర్ణబిందుప్రాస (శివకవులు ప్రయోగించినది) కలదు. దీనిని పూర్ణార్ధబిందుప్రాసమని కీర్తిశేషులు ప్రభాకర శాస్త్రిగారు వాడినారు. పూర్ణార్ధబిందుప్రాసమను పేరు స్పష్టముగాలేక సందేహముల కెడమిచ్చును. ఏలయనఁగా పూర్ణమునకు, అర్ధబిందువునకు వేఱ్ఱేఱుగా పూర్ణబిందుప్రాసమని అర్ధబిందు (సమప్రాసమని) ప్రత్యేకలక్షణములు గలవు. ప్రస్తుతము పూర్ణార్ధబిందుప్రాసమనఁగా పూర్ణార్ధబిందుప్రాసలు సాంకర్యము చెందినవన్న విపరీతార్ధమువచ్చును. కొంతసందేహము నకుఁగూడ తావుగలదు. నవీనవ్యాకరణపద నిర్వచనముల ననుసరించి, దీనిని సిద్ధసాధ్య బిందుప్రాసమనిన శాస్త్రీయముగ నుండునని గోచరించినది. విద్వాంసులు దీనిని చర్చింతురు గాత !

7 ఇందు షట్ప్రత్యయ ప్రస్తారము అక్కరలు మొదలగు ఛందశ్శాస్త్రవిషయము లేకాక, అలంకారశాస్త్రవిషయిక మగు దోషాధికారముకూడ వివరింపబడినది.

8 ఈగ్రంథమువలననే నలనామక గణములు గీదియలు అక్కరలు మొదలగు ప్రాచీనాంధ్ర ఛ్ఛందోవిశేషములు చాలఁగా నెఱుకపడును.

ఈముద్రణములో నాంధ్రసాహిత్యపరిషత్తు ముద్రణములలోనున్న యనవసరభాగములు తొలగింపఁబడినవి. కొన్ని ప్రక్షిప్తములుగా చూపబడినవి.

గ్రంథాదిని 'శ్రీకాంతా' యనుపద్యమునకు ముందు 'శ్రీకరముగ' అనుపద్యముతో ప్రారంభమగు పదిపద్యములు అప్పకవికాలమునుండి "శ్రీకాంతాతిప్రియ" అని యీ ఛందము మొదలిడుచున్నదని వ్రాయుచుండగా నీపది పద్యముల నెవ్వరో చేర్చియుండుట తథ్యము. అదియునుగాక నొక్క ప్రతిలో నున్నవి కావున తొలగింపబడినవి.

గణాధిదేవతలు, ఫలములు మొదలగువిషయము తరువాతికవులు విశేషముగా ప్రపంచించిరి. ప్రాథమికగ్రంథములలో ఛందోవిషయమంతయు నెఱిగినతరువాతగాని యెఱుగ నావశ్యకములేని యీవిషయమును కవి స్పృశించియుండడు. మఱియు నివి చాలప్రతులయందు కన్పట్టవు. భావిపరిశోధన కివి ప్రక్షిప్తములుగా చూపబడినవి.

యతులలో, భీమన పదియతులని చెప్పినవాక్యములోని వానికి లక్ష్యములు లేకపోవుటచే మేము సంప్రతించినప్రతులలో లేకపోవుటవలనను నిదియే చరిత్రానుకూలమగుటచేతను మూలమునుండి తొలగింపబడి ప్రక్షిప్తమున జూపబడినవి.

పరిషన్ముద్రణమున జూపిన కర్ణాటచ్ఛందస్సులసామ్యము మిందు తొలగింపబడినవి. దీనికి కారణ మాయాగ్రంథములలోని నేటిపాఠములకును కవిజనాశ్రయమున సంపాదకు లిచ్చిన పాఠములకును విశేషవ్యత్యాసము గానవచ్చుచున్నది. ఛందోంబుధి కవిరాజమార్గము మున్నగుగ్రంథములు సుపరిష్కృతములై యీతరువాత ముద్రితములగుటచే నవియే ప్రామాణికములు. ఇవి యన్నియు ప్రత్యేకము గ్రంథములుగ "ఛందస్సామ్యములను" వేర సంతరింపవలసియున్నది.

కీర్తిశేషులు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి స్వంత ప్రతియగు తాళపత్రగ్రంథమును శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారు ముద్రింపదలచి సాపువ్రాసి సరిచూచియిచ్చుటకు శ్రీ వేమ మళ్ల రాజగోపాలరావుగారి కిచ్చియుండిరి. కాని వారు చాల కాలమువఱకు దీనిని తమవద్ద నుంచుకొని గ్రంథము తిరిగి యీయలేదు. ఆపైని శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు కోర్టుమూలముగా, తమతండ్రిగారి ప్రతిని వారివద్దనుండి బడసిరి. ఆప్రతియే యీముద్రణమున కాధారమైనది.

ఇట్టి యపూర్వగ్రంథమును నింత సుపరిష్కృతముగ ముద్రించిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి కాంధ్రవిద్వల్లోక మెంతయేని కృతజ్ఞతం జూపఁదగియున్నది.

ఈగ్రంథ మామూలాగ్రముగ నత్యంతశ్రద్ధతోఁ బరిశీలించిన విద్వాన్ శ్రీతిమ్మావజ్ఝల కోదండరామశాస్త్రిగారికి, వ్యాకరణశిరోమణి శ్రీకందాడై కృష్ణమాచార్యులవారికి నా కృతజ్ఞతావందనములు. శ్రీవావిళ్లవారింకను యిట్టి అపూర్వలక్షణగ్రంథములను బ్రకటింతురుగాత!

మహాశివరాత్రి.<br>6-3-1951

ఇట్లు,<br>నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.

# విషయసూచిక

శ్రీ రేచనకృత

# కవిజనాశ్రయము

## సంజ్ఞాధికారము



క. శ్రీకాంతాతిప్రియ వా
క్ఛ్రీకాంత జగత్త్రయైకసేవితనుత వి
ద్యాకాంత దివ్య[1]కావ్యస
దేకాంత నితాంత కాంతి నీవుత మాకున్.

క. గురుయతి గణముల పాదాం
బురుహంబుల కెఱఁగి సుకవిబుధజనముల నా
దరమునఁ దలఁచి తదాజ్ఞం
బరహితచరి[2]తుఁడు [3]జినేంద్ర పదభక్తి మెయిన్.

క. పరఁగిన విమలయశో భా
సురచరితుఁడు భీమనాగ్రసుతుఁ డఖిలకళా
పరిణతుఁ డయ్యును [4]భూసుర
వరప్రసాదోదితధ్రువ శ్రీయుతుఁడై.

క. అసమానదానరవితన
య సమానోన్నతుఁడు వాచకాభరణుఁడు ప్రా

---

1 కాంత. 2 తుండు సాంధ్రపదభక్తి మెయిన్. 3 జితేంద్ర.
4 భాసుర.

ణ సమానమిత్రుఁ డీకృతి
కి సహాయుఁడుగా నుదాత్తకీర్తి ప్రీతిన్.

క. అనవద్యకావ్యలక్షణ
మొనరంగాఁ గవిజనాశ్రయుఁడు మల్లియరే
చన[1]సుకవి కవిజనాశ్రయ
మను ఛందము తెనుఁగు బాస నరుదుగఁ జెప్పెన్.

ఛందః ప్రశంస

*క. నెఱయంగా నీఛందము
తెఱఁ గెఱుఁగక కవితఁ [2]జెప్పు [3]ధృష్టాత్ముఁడు ద
బ్బఱ [4]చీకు చీకు గుత్తముఁ
[5]బఱపిన క్రియ నిఖిల హాస్యపదనిరతుఁ డగున్.

క. కడుఁ గవితామహిమకుఁ దివి
టెడుకవి కిచ్చుదువు తెఱఁగెఱింగినఁగా కె
క్కుడనుండి వచ్చు బేడఁ గడ
రెడు కబ్బము సెప్ప నురుపరిజ్ఞాన మిలన్.

---

1 దాను. 2 జెప్పఁ దివిరెడు కవి. 3 దీనాత్ముఁడు. 4 చీకటి గుత్తి మును. 5 బఱపెడి.

* నెఱయంగా నీఛందము
తెఱఁ గెఱుఁగక కవితఁ జెప్పఁ దివురునతఁడు ద
బ్బఱ చీకు చీకు గుత్తము
బఱపిన గతి నిఖిలహాస్య - పదనిరతుఁ డగున్.

(దబ్బఱ శబ్దముక్రింద—383 పుట.)

అచ్చుపాఠము. కాని సూ. ని ర వ సంపుటము, 233 పుటలో పైని శ. ర. పాఠమే యీయఁ బడినది. శ. ర. పాఠము అప్పకవీయపాఠము.

క. అతిశయముగఁ జెప్పిన స
త్కృతి కవుల కుదాత్తఫలము కీర్తిగఁ జేకుఱున్
మతి [1]నెఱుఁగక చెప్పిన దు
ష్కృతి కవుల కుదాత్తఫలముఁ గీర్తిని జెఱచున్.

క. [2]అమరఁగ వేల్పులచేఁ గ
బ్బము సెప్పియ కాదె వరముఁ బడసిరి మును బా
ణ మయూరాదులు సత్కా
వ్యము సెప్పినఁ బడయరాని వస్తువు గలదే!

క. కమనీయ సమస్త కళా
[3]గమములకును జన్మభూమి కావ్యము కావ్యా
గమవిదుఁడు సర్వవిదుఁ డని
సమయ చతుష్టయము నందుఁ జదివిరి [4]మొదలన్.

క. [5]శ్రుతులును శ్రుత్యంతంబులు
సితయశ! రాద్ధాంతములును సిద్ధాంతములున్
క్షితిలో సమయచతుష్టయ
మత మిది శాస్త్రార్థ సరణి మల్లియరేచా!

క. కావునఁ గవిత్వ తత్త్వము
భూవలయమునందుఁ దద్దపూజ్యం బని స
ద్భావమునఁ [6]జెప్పు కావ్య క
ళావేదులు వొగడఁ గావ్యలక్షణము మహిన్.

---

1 వగవక. 2 ఇది 'సకలనీతి సమ్మతము'లోఁ జేర్పఁబడినది. 3 క్రమములకును. 4 పథిలలన్. 5 ఇది యచ్చు ప్రతిలో లేదు. ఒక వ్రాఁతప్రతియందు మాత్రము కన్పట్టుచున్నది. 6 జెప్పెఁ గావ్య — అచ్చు ప్రతిపాఠము.

## కావ్యవిభాగము

క. హృద్యాఖ్యానవద్యకావ్యము
గద్యము పద్య మని చెప్పఁగా ద్వివిధ మగుఁ
[1]గద్యం బపాదపదనిక
రద్యోతి తనవరసార్థరచనల [2]నెగడున్.

క. నాలుగు పాదంబులతో
నాలుగు ప్రావళ్లి గూడినను బద్యము ప
ద్యావలియు నిరుతెఱఁగై చను
నోలిన వృత్తములు జాతులొనరం గృతులన్.

## పద్యవిభాగము

క. కమనీయ వృత్తములు గణ
సమక నిబద్ధములు శేషజాతులు మాత్రా
సమక నిబద్ధములు [3]నొ
క్క మాత్ర లఘువై ద్విమాత్రకము గురు వయ్యెన్.

## గురులఘువివేకము

క. గురువులు నిడుదలు జడ్డ
క్కరముల బొట్టుల పిఱుందకడ నూఁదిన య
క్కరములు, పెఱయవి లఘువులు
గురులఘువులు మూఁడు [4]గూడికొన గణమయ్యెన్.

---

1 పద్యంబు పాద. 2 చెల్లుఁగా. 3 నొక్కొమాత్ర లఘువై. ద్విమాత్ర గురువై నెగడుఁగా. 4 చేసి.

క. నీచిత్తంబున మెత్తు స
దాచారుల కనిన [1]మొదలియవి గురువు లగున్
నీచిత్త [2]మిగ్గుచుఁ బ్రకట స
దాచారుల కనినఁ బిఱిఁదియవి లఘువు లగున్.

క. తరుణ తర శశికరసుధ
చిర రేఖాకార మగుచుఁ [3]జెలువలరిన వ్రాల్
గురువు; మఱి లఘువు నిశిత
స్మరశర[4]నిభ మైన వ్రాయి మల్లియ రేచా!

## గణ స్వరూపము

క. [5]పొనరఁగ మూఁడెడలను మొద
ల నడుమఁ దుదిఁ గదియఁగ గురులఘువులు నేర్పెం
చిన మ భ జ స న య ర త నా
[6]మ నిరూపిత గణము లయ్యె మల్లియ రేచా!

క. గురువులు మూఁడిడ మగణము
పరఁగంగా నాదిగురువు భగణం బయ్యెన్
సరి మధ్య గురువు జగణము
సరసగుణా! యంత్యగురువు సగణం బయ్యెన్.

క. లఘువులు మూఁడిడ నగణము
లఘు [7]వాదిని నుండె నేని యగణ మగున్
లఘు మధ్యం బగు రగణము
లఘు వంత్యము తగణ మయ్యె లాలితకీర్తి!

---

1 ఁ బిఱిఁది యవి. 2 మెసయుం. 3 జెలువుగ వ్రాయన్ 4 నిభ మగును వ్రాయ. 5 ఒనరఁగ. 6 మరుచుంటను నీగణాళి మల్లియ రేచా! 7 వాచ్యంబయ్యె నేని.

క. గగ మాయె రెండు గురువులు
సగణంబును నొక్కలఘువుసల మనఁ బరఁగున్
నగణము లఘువును నల మగు
నగణంబును నొక్కగురువునగ మనఁబరఁగున్.

క. పరువడి గురు, లఘు, లఘు గురు
గురులఘువులు గ, ల, వ, హ ములగును, మఱి దీర్ఘ
స్వరయుతమై యున్న గణా
క్షరమును దద్గణము రెండుగా నెన్నఁబడున్.

క. భ ర త నగ నల సలంబులు
వరుసనె యియ్యాఱు నెన్న వాసవగణముల్
మరి న హము లినగణంబులు
సరవిం దక్కినవి యెల్లఁ జంద్రగణంబుల్.

క. అనుపమ మగు నిగ్గణముల
వినుత శ్రుతి సుభగ లలితవృత్తంబులు ము
న్నొనరింతు వానిపై
వళ్లను ప్రాలును విశ్రమంబులుం దెలియంగన్.

క. విలసత్పాదాద్యక్షర
ములు వళ్లగు నా ద్వితీయములు ప్రావళ్లై
నెలకొని తమతమ పాదం
బులయతిపై నన్నిపాద ములప్రా లమరున్.

వ. అందు వళ్లన్నవి స్వరవళ్లు, వర్గవళ్లు, సరసవళ్లు, ఎక్కటివళ్లు
నాఁ జతుర్విధంబు లయ్యె నందు స్వరవళ్లన్నవి.

## సంజ్ఞాధికారము

### స్వరవళ్లి

క. అ ఆ ఐ ఔ లకు మఱి
ఇ ఈ లు ఋ కారసహితములె ఏ లకు నౌ
ఉ ఊ ఌ దమలో నొనరిన
ఒ ఓ లకు వళ్లగు న్నయోన్నతచరితా!

క. స్వరగణము కకారాద్య
క్షరములతో సంధిఁ జేసి కదిసినచోఁ ద
త్స్వరము గొని చెప్పునది వ
ళ్లరవిందజసదృశ! కవిజనాశ్రయ కృతులన్.

మఱి వర్గవళ్లన్నవి.

క. నిక్కపు [1]మర్త్య వర్గపు
నక్కరముల వళ్లు నిల్ప నగు ఙ ఞ ణ న మల్
దిక్కఁ బెఱ నాలుగింటను
తక్కరి సన్నిభుఁడ! రేచ! ధీజన[2]వంద్యా!

మఱి సరసవళ్లన్నవి.

క. అయహలు చ ఛ జ ఝ శ ష సలు
నయవినయాన్వితుఁడ! రేచనా! న ణ లు గుణ
ప్రియ! యివి యొండొంటికి ని
శ్చయముగ వళ్లయ్యె సర్వశాస్త్ర విధిజ్ఞా!

క. వెలయఁ జ వర్గమునకు భూ
తలమున శ ష స లవి వళ్లౌ సదా మగు నని ని

---

1 మర్త్యా. 2 వినుతా!

శ్చలమతి మల్లియరేచన
సలలితముగఁ జెప్పు పూర్వశాస్త్రోక్తవిధిన్.

మఱి యొక్కటి వళ్లిన్నవి.

క. ధర జ ఝ లను నీరెండ
క్షరములు విన్నయది లేదు కబ్బము మొదలన్
మ ర వ ఱ ల లు నానేన
క్కరములు తఱుతమకె వళ్లు కమలాధీశా!

## ప్రాసములు

క. భాసురము లగుచు సుకర
ప్రాసాను ప్రాసదుష్కర ప్రాసాంత్య
ప్రాసద్విప్రాసత్రి
ప్రాసము లన షడ్విధములఁ బరఁగును గృతులన్.

వ. అందు సుకరప్రాసం బన్నది సులభాక్షరంబులు ప్రాసంబిడి చెప్పునది.

క. పరమోపకార ధరణీ
సురవరసురభూజ సుగుణసుందర తరుణీ
స్మరనిభ సుకరప్రాసం
బరుదుగఁ గృతులందు నొప్పు నభినుతచరితా!

వ. దుష్కరప్రాసం బన్నది విషమాక్షరంబులు ప్రాసంబడి చెప్పునది.

క. స్వఃకాంతా సమయోషి దు
రఃకృతరతి చిహ్నదుష్కరప్రాసం బా

వి॥ కృత మగు నిట్లు సుప్రు
త్రః కులదీపక యనంగఁ ॥ దగుచు మహాత్మా!

వ. మఱి ద్విప్రాసం బనిన రెండక్షరములు ప్రాసం బిడి చెప్పునది.

క. దోసంబు లేక వస్తు ని
వాసంబై వెలయఁ జెప్ప ॥ వలయును ద్వంద్వ
ప్రాసం బుచితాక్షర వి
న్యాసంబుగఁ గృతుల లేచ! ॥ నయతత్త్వ నిధీ!

వ. మఱి త్రిప్రాసం బన మూఁడక్షరములు ప్రాసంబిడి చెప్పునది.

క. దానమున సత్యమున సభి
మానమునం బోల్ప నీస ॥ మానము ధరణిం
గాన మనం ద్రిప్రాసము
దాన మనోహర మగును బు ॥ ధ స్తుతచరితా!

వ. మఱి యనుప్రాసం బన్నది ప్రాసాక్షరంబు పెక్కెడల నిడి
చెప్పునది.

క. విత్రస్తాఘ పవిత్ర చ
రిత్ర జితత్రిదశవర ధరిత్రీనుత స
న్మిత్రాం బుజ మిత్ర గుణా
మత్ర యనుప్రాస మిదియ ॥ మల్లియ రేచా!

వ. మఱి యంత్యప్రాసం బన్నది మొదటి పాదము కడపటి
యక్షరంబు నాలుగుపాదంబుల కడపట నిడి చెప్పునది.

క. జననుత భీమతనూజా!
సునయార్పిత విభవ తేజ ॥ సుభగమనోజా !

వినుత విశిష్ట సమాజా!
యన నంత్యప్రాస మగు న ॥ హార్వతి తేజా!

క. విశ్రాంతి, విరతి, విశ్రమ
విశ్రామ, విరామ, విరమ, ॥ విరమణ లనఁగా
విశ్రుత మగు యతి కృతి కధి
కశ్రావ్యంబై బెడంగు ॥ గా నిడవలయున్.

క. [1]హిమకర కర[2] వైశ్వానర[3]
[4]సముద్ర [5]బాణ [6]ర్తు ముని[7] భు ॥ జంగమ[8] నందా[9]
ద్యమితగణో క్తి సంజ్ఞా
క్రమ మెఱుఁగఁగ వలయు నెన్నఁ ॥ గాఁ దగు నెడలన్.

క. సంగతముగ నానావిధ
భంగిన యతిభంగ శబ్దభంగ చ్ఛందో
భంగాది దోషరహిత మ
నం గబ్బము సెప్పరేని ॥ నగుదురు గవులున్.

ఇది శ్రీవాదీంద్రచూడామణి చరణ సరసీరుహ మధుకరాయ
మాణ కవిజనాశ్రయ శ్రావకాభరణ విరచితంబైన కవిజనా
శ్రయమున సంజ్ఞాధికారము.

---

•

# క వి జ నా శ్ర య ము

## వియతిచ్ఛందోఽధికారము.



క. పరమాత్మ ముఖారుణసర
సిరుహ వినిర్గత సమస్తసిద్ధాక్షర పం
క్తి రసావహ మృదుపద సుం
దరతరకృతిరచన లీవుతను దయ మాకున్.

క. సమవృత్తములఁ జతుష్పా
దముల నొకయక్షరము మొదలుగాఁ బెంపఁగ నెక్కుఁ
క్రమగణిత వృత్తములకును
సమమై చను నిరువదాఱుఛందములందున్.

వ. ఉక్త, అత్యుక్త, మధ్యమ, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్ అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, అతి జగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అభికృతి, ఉత్కృతి, అన నిట్లు సమవృత్తంబులను నుత్తమరత్నంబులు పుట్టి నాకరంబైన సాగరవేలయుంబోలె నొప్పుచున్న యీయిరువదాఱుఛందంబుల వేఱువేఱ నెఱిఁగించెద.

1 ఉక్తాచ్ఛందంబునకు నొకయక్షరంబు పాదంబుగా రెండు వృత్తంబులు పుట్టె నందు శ్రీ యనువృత్తము.

శ్రీ

శ్రీ
శ్రీన్
దే
యున్

2 అత్యుక్తాచ్ఛందంబున రెండక్షరంబులు పాదంబులుగా నాలుగువృత్తంబులు పుట్టె. అందు.

శ్రీ పెంపువృత్తము.

శ్రీ పెం
పోపున్
బ్రాపున్
గాపున్

3 మధ్యమాచ్ఛందంబునకు మూఁడక్షరంబులు పాదంబులుగా నెనిమిదివృత్తంబులు పుట్టె. అందు.

వినయమనువృత్తము.

వినయం
బునయం
బునయ
జ్ఞునకున్

4 ప్రతిష్ఠాఛందంబునకు నాలుగక్షరంబులు పాదంబులుగాఁ బదునాఱువృత్తంబులు పుట్టె. అందు.

బింబమను వృత్తము.

పంబిభ కా
రంబు గ కా

రంబునుగా
బింబముగున్

సుకాంతి యను వృత్తము. జకారమున్
గకారమున్
సుకాంతికో
ప్పకుండునే

5 సుప్రతిష్ఠాఛందంబున నైదక్షరంబులు పాదంబులుగా ముప్పదిరెండువృత్తములు పుట్టె. అందు.

సుందరి వృత్తము. చెంది భకారం
బొంద గగంబుల్
సుందరి యన్నో
రందురు సూరుల్

ప్రగుణవృత్తము. సగణంబొందన్
గగముం జెందన్
ప్రగుణంబన్నో
రగునీధాత్రిన్

అంబుజవృత్తము. ఇంబుల భకా
రంబునులం
బుంబొనలఁగా
నంబుజమగున్

క. ఛందోదేవత సజ్జన
వందిత గాయత్రి మధురవచనామృతని
ష్యందంబు మస్తకేందువు
నం దొందించునదిగాత మానందమునన్.

6 గాయత్రీఛందంబునకు నాఱక్షరంబులు పాదంబుగా ఒ౪
వృత్తములు పుట్టె అందు.

| | |
|---|---|
| విచిత్రవృత్తము. | యయంబుల్ విచిత్రా<br>హ్వయంబయ్యె ధాత్రిన్ |
| తనుమధ్యావృత్తము. | ఎంచం దయముల్ప్రా<br>పించున్ దనుమధ్యన్ |
| సురలతావృత్తము. | పరగనయంబుల్<br>సురలతకొప్పున్ |

7 ఉష్ణిక్ఛందంబునకు నేడక్షరములు పాదంబుగా ౧౨౮ వృత్తం
బులు పుట్టె అందు.

| | |
|---|---|
| విభూతివృత్తము. | శ్రీఫలావిభూతియౌ<br>రేఫపై జగంబుగాన్ |
| మదనవిలసితవృత్తము | మదనవిలసితం<br>బుదితననగలన్ |
| కుమారవిలసితవృత్తము. | కుమారవిలసితం<br>బు మాజనగలన్ప |

| | |
|---|---|
| సురుచిర వృత్తము. | భాసురభసగల్ రే<br>చా! సురుచిర మయ్యెన్ |

8 అనుష్టుపు ఛందంబున కెనిమిది యక్షరంబులు పాదంబుగా ౨౫౬ వృత్తములు పుట్టె అందు

| | |
|---|---|
| విద్యున్మాలా వృత్తము | ఉద్యన్మాగాయుక్తం బైనన్ విద్యున్మాలావృత్తం బయ్యెన్ |
| చిత్రపదవృత్తము | సద్విధిఁ జిత్రపదంబౌ భద్వయగద్వయ మొప్పన్ |
| మాణవకవృత్తము | మాణవకాఖ్యం బగున క్షీణభతంబుల్ లగముల్ |
| ప్రమాణీవృత్తము | అగుం జకారరేఫలున్ లగంబులుం బ్రమాణికిన్ |
| సమానీవృత్తము | ఇంబుగారజంబు వకా రంబుగా సమాని యగున్ |
| సింహరేఖావృత్తము | శ్రీరజంబుపై గగంబున్ చేరసింహరేఖ యయ్యెన్ |

9 బృహతీఛందంబున తొమ్మిది యక్షరంబులు పాదంబుగా ౫౧౨ వృత్తంబులు పుట్టె అందు.

| | |
|---|---|
| భుజగశిశురుతవృత్తము | భుజగ శిశురుతమన్పే ర్మి జరుగు ననయములాన్ |
| హలముఖీవృత్తము | చిత్రజోపమహలముఖీ వృత్త మయ్యెను రనసలన్ |

ఉత్సుకవృత్తము — సుందరమై బభరంబు లిం
పొందిన సుత్సుకమై చనున్

భద్రకవృత్తము — విద్రుతాఘ రనరంబులుఁ
భద్రకం బగుధరిత్రిపై

ఇది శ్రీవాదీంద్రచూడామణి చరణసరసీరుహమధుక
రాయమాన కవిజనాశ్రయశ్రావకాభరణాంక విరచితంబైన
కవిజనాశ్రయంబను ఛందంబునందు నియతిచ్ఛందోధికారము.



# కవిజనాశ్రయము

## యతిచ్ఛందోఽధికారము



క. మందరగిరినిభుఁ డఖిల
ఛ్ఛందోర్ణవపారగుండు సత్కవి సయతి
ఛ్ఛందోలక్షణమందం
బొందంగాఁ గవిజనాశ్రయముం దొనరించున్.

క. వెలయ నిటఁ బట్టి వళు లిడ
వలయును, విశ్రమము నిలుపవలయును గబ్బం
బులఁ గావున నే నెయ్యెడ
నిలిపితి నయ్యెడ నెఱింగి నిలుపుఁడు వానిన్.

క. వృత్తములకుఁ దగు పేళ్లను
వృత్తగణాక్షరము లెడను విశ్రామంబుల్
వృత్తార్థమునన చెప్పుదు
వృత్తసమూహజ్ఞులెల్ల వేడుకఁ బొగడన్.

10 పఙ్క్తిచ్ఛందంబునకుఁ బదియక్షరంబులు పాదంబుగా ౧౦౨౪ వృత్తంబులు పుట్టె. అందు—

రుగ్మవతీవృత్తము. వాగ్మి! భమప్రవ్యక్తిసగంబుల్
రుగ్మవతీ సోద్రూపక మయ్యెన్.

మత్తావృత్తము. మత్తావృత్తం బగు మభసంబు
ద్యత్తేజస్వీ! గయుతముగాఁగన్.

మయూరసారివృత్తము. పన్నుగా రజంబుపై రగంబుల్
సన్నుతా! మయూరసారిఁ జెప్పున్.

[1]శుద్ధవిరాటీవృత్తము. [2]సంబుద్ధిన్ మసజంబుతోఁ గకా
రంబై శుద్ధవిరాటినాఁ జనున్.

పణవవృత్తము. యత్నంబై మనయుగముల్ వాక్ఛ్రీ
పత్నీవల్లభ! పణవం బయ్యెన్.

11 త్రిష్టుప్ఛందంబునకుఁ బదునొకండక్షరములు పాదంబుగా
నంరరా వృత్తంబులు పుట్టె. అందు—

శాలినీవృత్తము. [3]వంద్యశ్రీ సంసేవ్యవతూ! మతాగా
నింద్యంబైనన్ శాలినీనామమయ్యెన్.

ఇంద్రవజ్రావృత్తము. ఇత్తాజగాసంగతి నింద్రవజ్రా
వృత్తంబగున్ సన్నుతవృత్తరేచా!

ఉపేంద్రవజ్రావృత్తము. [4]జపాఢ్యరేచా! జతజల్గగంబీ
యుపేంద్రవజ్రాఖ్యమునొప్పఁజెప్పున్.

రథోద్ధత వృత్తము. నందితప్రియ! రనంబుపై రవం
బొందివచ్చిన రథోద్ధతం బగున్.

చంద్రికా వృత్తము. ననరవము విన మ్రవిద్విషా!
జినమతహిత! చెప్పఁ జంద్రికన్.

---

1 శుద్ధవిరాటీ. 2 సంబుద్ధీ. 3 వద్యశ్రీసంసేవితాభా మతాగా వేద్యం బైనన్ శాలినీవృత్తమయ్యెన్. 4 సపద్మపద్మా!

స్వాగత వృత్తము. స్వాగతంబగు లసద్గుణలక్ష్మీ
భాగభోగి! రనభల్ గగయుక్తిన్.

కాంతా వృత్తము. సారప్రభవాద్య! తజావము లా
కారస్మర! పొందినఁ గాంత యగున్.

శ్యేనీ వృత్తము. శ్యేనికిన్ రజంబు చెందఁగా రనం
బానతారి!పొందునంద మొందఁగాన్.

వాతోర్మీవృత్తము. వారశ్రీవల్లభ! వాతోర్మికి న్మా[న్.
భారంబయ్యెన్మభతంబుల్ లగము

[1]తోధకవృత్తము. శ్రీయుత! భత్రయ సేవ్యగగంబుల్
తోయజలోచన! తోధకమయ్యెన్.

12 జగతీఛందంబునకుఁ బండ్రెండక్షరంబులు పాదంబుగా రంగాఢ వృత్తంబులు పుట్టె. అందు.

భుజంగప్రయాతవృత్తము. జగద్గీతకీర్తి! భుజంగప్రయాతం
బగున్ రేఫనా! యవ్యయవ్యంద్వ
మైనన్.

తోటకవృత్తము. తుదిదాఁకస కారచతుష్కముగా
విదితంబుగఁ దోటకవృత్తమగున్.

ఇంద్రవంశవృత్తము. [2]సన్నానదానా! తతజంబు రేఫతో
విన్నింద్రవంశాహ్వయవృత్తమైచనున్

వంశస్థవృత్తము. సముజ్జ్వలాంగా! జతజంబు రేఫతో
సమర్పవంశస్థపమాహ్వయంబగున్.

---

1 తోదక-పా. దోధకమని కొందఱందురు. 2 సన్నానదాని.

ద్రుతవిలంబితవృత్తము. ద్రుతవిలంబిత।దుష్కర వృత్త మ
ప్రతిమ! యొప్పు న।భారగణంబులన్.

[1]తోదకవృత్తము. జలరుహావక్త్ర! న।జాయగణంబుల్
వెలయఁగఁ దోదక।వృత్తముఁ జెప్పున్.

స్రగ్విణీవృత్తము. వాగ్వధూవల్లభా! । వార్ధి రేఫావళిన్
స్రగ్విణీవృత్తవి।శ్రామముల్ ధాత్రిపై.

జలధరమాలావృత్తము. మారాకారా! జలధర।మాలా వృత్తా
కారంబయ్యెన్ మభసమ।కల్పంబైనన్.

[2]ప్రియంవదావృత్తము. నయుతమై నెగడి।నం బ్రియంవదా
హ్వాయమగున్ భజర।వర్గమిమ్మహిన్.

ప్రమితాక్షరవృత్తము. [3]అమరంగఁ జేయు సజ।సావళితోఁ
బ్రమితాక్షరాఖ్యము న।పారగుణా.

జలోద్ధతగతివృత్తము. జలోద్ధతగతిన్ । జసంబుల జసం
బులొందియొఱఁగిం।పు [4]భూజననుతా!

విశ్వదేవీవృత్తము.
విద్వద్వృందోద్యద్వృత్త! । విన్మద్వ్యయంబున్
యద్వంద్వంబున్ గావించు । నవ్విశ్వదేవిన్.

13 అతిజగతీఛందంబునకుఁ బదుమూఁడక్షరంబులు పాదంబుగా
౮౧౯౨ వృత్తంబులు పుట్టె. అందు.

ప్రహర్షిణీవృత్తము. [5]నీతిజ్ఞస్తుత ధర।ణిన్ బ్రహర్షిణీవి
ఖ్యాతంబుల్ మనజర।గంబులంబుజాస్యా!

---

1 రోదక. 2 ప్రియంవరా. 3 అమరంగఁజెప్పు... యీప్ర...
4 భోజవినుతా. 5 నీతిజ్ఞోద్ధర.

రుచిరవృత్తము.

అనంగసన్నిభ! రుచిరాహ్వయం బగున్
ఘనంబుగా జభసజగంబు లొందినన్.

మత్తమయూరవృత్తము.

అన్వీతోద్యద్వ్యాజ్ఞిలయా! మత్తమయూరం
బన్వృత్తం బయ్యెన్ మతయంబుల్ సగయుక్తిన్.

మంజుభాషిణీవృత్తము.

జగదేకమిత్ర! సజసంబుపై జగం
బగుమంజుభాషిణికి నంద మొందఁగాన్.

జలదవృత్తము.

అభరనంబుపై భగురువైనఁ గవీం
ద్రాభరణీయమాన! జలదాఖ్య మగున్.

ప్రభాతవృత్తము.

మొనసినజారగముల్ సనం బ్రభాతం
బనియెడువృత్త మనంగసన్నిభాంగా!

14 శక్వరీఛందంబునకుఁ బదునాలు గక్షరంబులు పాదంబుగా
౧౬౩౮౪ వృత్తంబులు పుట్టె. అందు.

వసంతతిలకవృత్తము.

సారంబుగాఁ దభజజంబు వసంతరాజా
కారా! వసంతతిలకం బగు గాయుతంబై.

అపరాజితవృత్తము.

ననరసలగముల్ పెనంగినసద్యశో

ధన! వినుము పరాజితం బగు రేచనా!

వనమయూరవృత్తము.

నందితగుణా! భజసనంబులు గగం బిం
పొంది చనఁగా వనమయూర మగుఁబేర్మిన్.

ప్రహరణకలితవృత్తము.

ప్రహరణకుశలా! ప్రహరణకలితక
సహజము లనఁగాఁ జను ననభనవల్.

అసంబాధవృత్తము.

[1]సార ప్రజ్ఞాంభోనిధిపురుష! యసంబాధా
కారాన్వితంబై చను మతనసగాయుక్తిన్.

భూనుతవృత్తము.

శ్రీనివాస! రనభావలిఁ జెంది గగంబుల్
భూనుతంబుగ నొడంబడి భూనుతమయ్యెన్.

జలంధరవృత్తము.

వ్రాలిభ కారమునుం భభజవంబులతో
లాలితకీర్తి! దిశాయతిజలంధరయా.

సుందరవృత్తము. సుందరరూపసమేత! సుందరవృత్తమిం
పొందుచు భారసవంబులొంది బెడం
గగున్.

**15** అతిశక్వరీఛందంబునకుఁ బదునైదక్షరంబులు పాదంబుగా ౩౨౭౬౮ వృత్తంబులు పుట్టె. అందు.

---

1 సారప్రాగంభోనిధి.

**మణిభూషణశ్రీవృత్తము.**

శ్రావకాభరణ! శుభ్రయశా! మణిభూషణ
శ్రీ వెలుంగు రనభారవిశేషగణంబులన్.

**అలసగతివృత్తము.**

[1]పొలసి ససనంబు భయమున్ వెలయఁగా నిం
దలసగతి యంచుఁ గృతియందు నుతిఁ బొందున్.

**మాలిని.**

ననమయయయుతంబై నాగవిశ్రాంతమై యొ
ప్పను పమగుణ! మాలిన్యాహ్వయం బయ్యె ధాత్రిన్.

**సుకేసరము.**

హరినిభమూర్తి! సత్కవిజనాశ్రయా! సుకే
సరము గుది గ్వతిన్న జభజంబు రేఫతోన్.

**మనోజ్ఞ.**

నజజభర ప్రకరంబు నన్నిధి విశ్రమం
బజితమనోజ్ఞ మగుఁ నయం బొనగూడఁగాన్.

**మణిగణనికరము.**

మనులఘు గురుకము మణిగణనికరం
బనఁ జను నెనిమిది యగు నెడ యతిగాన్.

**హంసయానము.**

ఆనతారి రేచ! హంసయాన కొప్పుఁ గుంజర
స్థానవిశ్రమంబుగా రజద్వయంబు రేఫతో.

---

1 పొలచి

16 అష్టిఛందంబునకుఁ బదియాఱు అక్షరంబులు పాదంబుగా ౬౫౫౩౬ వృత్తంబులు పుట్టె. అందు.

పద్మవృత్తము.

నభజజంబులు జగంబుఁ బోనంగి యతుల్దిశా
ప్రభవమై కవిజనాశ్రయ! పద్మ మనం జనున్.

ప్రియకాంతావృత్తము.

నయనయసంబుల్ గురువు పోనంగం బ్రియకాంతా
హ్వాయ మగు శిష్టామరతరువా! దిగ్యతి నైనన్.

చంద్రశ్రీవృత్తము.

కవీంద్రేంద్రత్క్ష్మాజా! యమన సరగ ప్రాప్తమైనన్
గవీంద్రుల్ చంద్ర శ్రీయనిరి యతిగా రుద్రసంఖ్యన్.

మేదినీవృత్తము.

సజభజముల్ రగంబులఁ బోనంగి దిగ్విరామ
ప్రజనికలాప్త మేదినికిఁ బంకజోపమాస్య!

[1]పంచచామరవృత్తము.

జరల్ జరల్ జగంబుఁగూడ జాలిరేచనా! నిధి
స్ఫురద్విరామమైధరిత్రిఁ బొల్చుఁబంచచామరన్.

మదనదర్పవృత్తము.

శ్రీభసజరజల్గయుక్తిఁ జెంది వచ్చినం గుమా
రాభ! మదనదర్పమయ్యె నబ్జభూవిరామమై.

---

1 కనద్యశా! జరంబుతో జ. కారముల్ రజంబులున్
జనన్ గకారయుక్తిఁ బంచ చామరం బగున్ ధరన్.

17 అత్యష్టిఛందంబునకుఁ బదియేడక్షరంబులు పాదంబుగా ౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టె. అందు.

శిఖరిణీవృత్తము.

పురారాతిస్ఫూర్తీ! యమనసభవంబుల్ వెనఁగి సుం
దరంబై నగ్రేచా! శిఖరిణి యగుఁ ద్వాదశయతిన్.

సుగంధివృత్తము.

భాసురంబుగా రజవ్రయంబుపై రవంబు గూడఁగా
నాసుగంధికిన్ దిశావిరామమొప్పుంచితంబగుఁ ధరన్.

హరిణీవృత్తము

నసమరసవప్రోక్తంబై రుద్రనవ్యవిరామ మిం
పెసఁగహరిణీవృత్తంబయ్యెన్ గవీంద్రజనాశ్రయా!

పాలాశదళవృత్తము.

శదియఁగ ననన నగగములకును బాలా
శదళమనఁజనునది దశమయతియుఁగాఁగన్.

మందాక్రాంతావృత్తము.

కాంతాకాంతా! మభనతతగాకాంతి సంక్రాంతిమందా
క్రాంతం బన్వెర మరుదశమాక్రాంత విశ్రాంతమైనన్.

నర్కుటవృత్తము.

నజభజజల్ వకారము పెనంగిన నర్కుటకం
బజితగుణాన్వితా! యతిదిశాన్వితమై పరఁగున్.

పృథ్వీవృత్తము.

ప్రియం బగుచు రుద్రవిశ్రమము పృథ్వీకాసంజ్ఞకా

హ్వాయంబగుజసంబుతోజసయవంబులుఁ గూడినన్.

18 ధృతిచ్ఛందంబునకుఁ బదునెనిమిది యక్షరంబులు పాదంబుగా ౨౬౨౧౪౪ వృత్తంబులు పుట్టె. అందు.

కుసుమితలతావేల్లితవృత్తము.

అశ్రాంతత్యాగాన్విత!మతనయాయంబులఁ రుద్రసంఖ్యా
విశ్రాంతంబై నఁ గుసుమితలతావేల్లితా వృత్తమయ్యెన్.

మత్తకోకిలవృత్తము.

శ్రావకాభరణాంక! విఁ రసజాభ రేఫలదిగ్విరా
మావహంబుగ మత్తకోకిల యండ్రు దీనిఁ గవీశ్వరుల్.

అతివినయవృత్తము.

ననలుగలయఁగ ననలనసయుతములగుచుఁ
దనరు నతివినయ యిదిదశయతిఁ గృతులన్.

త్వరితపదగతివృత్తము.

సరసిరుహాభవసదృశచతుర! నననానాయల్
త్వరితపదగతి కరుదశమయతియుఁ గాఁగన్.

19 అతిధృతిచ్ఛందంబునకుఁ బందొమ్మిదియక్షరంబులు పాదంబులుగా ౫౨౪౨౮౮ వృత్తంబులు పుట్టె. అందు.

శార్దూలవిక్రీడితవృత్తము.

సారాచారవిశారదా! యినయతిఁ శార్దూల విక్రీడితా
కారంబై మసజస్సులిమ్ముగ సతాగప్రాప్తమై చెల్వగున్.

మేఘవిస్ఫూర్జితవృత్తము.

మృగేంద్రోద్యచ్ఛౌర్యా!యమనసములఁ మేఘవిస్ఫూర్జితాఖ్యం
బగున్షీఁదన్ రాగంబొడఁబడిన సూర్యాంకవిశ్రాంతమైనన్.

తరలవృత్తము. —

ప్రసర రుద్రవిరామయుక్తి నభంబులుఁ రసజాగముల్
గవిజనాశ్రయ! పొంది యందముగా మహిన్ దరలంబగున్.

చంద్రకళావృత్తము. —

శ్రావకాభరణాంక! దిశావిశ్రామముతోడ రసాతముల్
జావిలగ్నగకారయుతంబై చంద్రకళాహ్వయమై చనున్.

భూతిలకవృత్తము. —

భారసజాగగణంబులఁ గుచభారనమ్రవధూముఖాం
భోరుహభాస్కర! రుద్రయుగ్యతిఁ బూని భూతిలకం బగున్.

శుభికావృత్తము —

సూరిస్తుత్యా! మభనసవిలసిత సూర్యయతిన్ శుభికా
కారంబై యెల్లకృతుల వెలయును గల్పితభాగలచేన్.

20 కృతిచ్ఛందంబున కిరువదియక్షరంబులు పాదంబుగా
౧౦౪౮౫౭౬ వృత్తంబులు పుట్టె. అందు.

మత్తేభవిక్రీడితవృత్తము.

స్మయదూరా! విలసత్త్రయోదశయతిన్ మత్తేభవిక్రీడితా [నన్.
హ్వయమయ్యెన్ సభరంబులున్ నమయవవ్రాతంబులుం గూడి

ఉత్పలమాలావృత్తము.

భానుసమాన! విస్ఫురదభారలగంబులఁ గూడి విశ్రమ
స్థానమునందుఁ బద్మజయుతంబుగ నుత్పలమాలయై చనున్.

అంబురుహవృత్తము.

శ్రీరమణీప్రియ! మల్లియరేచ! విశిష్టకల్పమహీజ! భా-

భారసవంబుల నంబునహం బగు ప్రాసువిశ్రమయుక్తమై.

ఖచరప్లుతవృత్తము.

అమితసాహస! రుద్రవిరామాయుక్తము లై నసభానసా
వము లగుఁ ఖచరప్లుతనామకవృత్తిని యుక్తసమేతమై.

ప్రభాకలితవృత్తము.

వెలయు నజాభరసంబులుఁ రవిరవిశ్రమంబులునుం ప్రభా
కలితకు నొప్పు నగణ్యపుణ్య లగంబుమీఁద ధరఁ గృతిన్.

21 ప్రకృతిచ్ఛందంబునకిరువదియొక్కయక్షరంబులు పాదంబుగా
౨౦౯౭౧౫౨ వృత్తంబులు పుట్టె. అందు.

స్రగ్ధరావృత్తము.

శ్రీమన్మూర్తీ! మరా భా శ్రితరభనయయా సేవ్యమైసానుమద్వి
శ్రామంబై సానుమద్విశ్రమమునమరఁగా స్రగ్ధరావృత్తమయ్యెన్

చంపకమాలావృత్తము.

నజభజజల్ జరేఫలు పెనంగి దిశాయతితోడఁగూడినన్
[1] త్రిజగదభిస్తుతా!బుధనిధీ! విను చంపకమాలమై చనున్.

[2]లాటీవిటవృత్తము.

ససమాతయంబులు సూర్యయతి శ్రవ్యంబై లాటీవిటవృత్తం
బసమానయశా!నుతమానగుణా యాశ్చర్యాన్వితంబగు ధాత్రిన్

వనమంజరీవృత్తము.

నయుతజకారచతుష్కభరేఫగణత్ర యోదశవిశ్రమా
శ్రయమగు నవ్వనమంజరి రేచన! సర్వశాస్త్రవిశారదా!

---

1 త్రిజగదభిష్టుతా! 2 లాటవిట.

మణిమాలావృత్తము.
కదియంగ మూఁడుసజములొ సకారయుతమై దిశాఖ్యయతిగా
మదనానుకారి ! నిఖిలాగమజ్ఞ ! మణిమాలయండ్రు సుకవుల్.

22 ఆకృతిచ్ఛందంబున కిరువదిరెండక్షరంబులు పాదంబుగా.
 ౪౧౯౪౩౦౪ వృత్తంబులు పుట్టె. అందు.

మహాస్రగ్ధరావృత్తము.
లసద్విద్యత్కీర్తివల్లీలలితగుణగణాలంకృతాంగా ! సతానస్థ
స్థసరాగంబుల్ మహాస్రగ్ధరకు వసుమునిస్థానవిశ్రాంతినొప్పున్.

సుభద్రకవృత్తము.
మందరభృత్సమాన! నిఖిలాగమజ్ఞ! వెలయంగ రుద్రయతితో
నందముగా భసంయుతరనత్రయాగ్రగురువై సుభద్రకమగున్.

మానినీవృత్తము.
కారకముల్ క్రియ గన్గొన నేడు భ
 కారములొక్క గకారముతో
గారవమై చనఁగా యతి పండ్రెటఁ
 గల్గిన మానిని కామనిభా !

తురగవృత్తము.
నననసజములను జగముఁ దుద నాటుకొల్పిన రేచనా !
చనుఁ దురగమనజగతి నిది మనుసంప్రయుక్తవిరామమై.

23 వికృతిచ్ఛందంబున కిరువదిమూఁడక్షరంబులు పాదంబుగా.
 ౮౩౮౬౦౮ వృత్తంబులు పుట్టె. అందు.

అశ్వలలితవృత్తము.

నజగణముల్ భజవ్యయముతోఁ బో
నంగిభవయుక్తమై ధరణీసూ
ర్యజ మగువిశ్రమం బమరియున్నే
నశ్వలలిత మ్మగున్ గుణనిధీ!

కవిరాజవిరాజితవృత్తము.

క్రమమున నొక్క నకారము నాలు జ
కారములుం బరఁగంగ వకా
రమును నొడంబడి రాఁ గవిరాజ వి
రాజిత మన్నది రామనిభా!

24 సంకృతిచ్ఛందంబున కిరువదినాలుగక్షరంబులు పాదంబుగా ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె. అందు.

సరసిజవృత్తము.

మారాకారా! చారుచరిత్రా! మ
తయననననస మహీ యతి రచనన్
పారం బైనన్ సూరికవీంద్రుల్ స
రసిజ మని వినఁ జదివిరి సభలన్.

క్రౌంచపదవృత్తము.

పంచశరాభా! సంచితపుణ్యా! భ
మసభననననయ పరిమిత మైనన్,
క్రౌంచపదాఖ్యం బంచిత మయ్యెన్ క్ర
మ యతి దశవసు కలితముగాఁగన్.

25 అభికృతిచ్ఛందంబున కిరువదియైదక్షరంబులు పాదంబుగా 33554432 వృత్తంబులు పుట్టె. అందు.

బంధురవృత్తము.

అమరఁగ ననననసభభభగయుతంబై
తిథి విశ్రమ మొంది చనన్
బ్రముదితకువలయ! పరహితచరితా? బంధుర మన్నది వృత్త మగున్.

భాస్కరవిలసితవృత్తము.

భాస్కరసదృశసముజ్జ్వలతేజా!
భాసురభనజయభననసగంబుల్
భాస్కరవిరమణబంధుర మైనన్
భాస్కరవిలసిత మనిరి కవీంద్రుల్.

జలదరవవృత్తము.

నన నన ననలు ననల్ నొడఁబడిన్
నయవినయనిధి! వినుము రే
చన! మను యతిని నిలుపఁగ మహిని
జలదరవ మగుగురువుతోన్.

26 [1]ఉత్కృతిచ్ఛందంబున కిరువదాఱక్షరంబులు పాదంబుగా 67108864 వృత్తంబులు పుట్టె. అందు.

భుజంగవిజృంభితవృత్తము.

[2]ధీరాసారత్వోదారత్వస్థిరగుణ! వసు
దశమయతిన్ భుజంగవిజృంభితా

1 వ్యుత్కృతి 2 ధీరాధారతోందారత్వాదృత.

కారం బారంగాఁ దోఁచుఁ సంగత్రనుమత్రస
ననరసాకారమై వయుతంబుగాన్.

మంగళమహాశ్రీవృత్తము.

శ్రీమహిత! లోకహిత! శిష్టజనసేవిత!
విశేషగుణ! మంగళమహాశ్రీ
[1]నామ మగు నభ్భజసనంబుల కడన్
భజసనంబులు గగంబులు పెనంగన్.

క. కమనీయం బగు నీక్రియ
సమవృత్తము లిరువదాఱుఛందంబులనీ
క్రమమున మల్లియ రేచన
రమణీ[4]రమణీయరమణరమణుఁడు చెప్పెన్.

చ. ఒగిఁబదుమూఁడుకోటులును నొప్పగ నల్వదిరెండు లక్ష
లున్, దగఁబదియేడువేలు విదితంబుగఁదానట నేడు నూ
టిపై, నగణితవైభవా! యిరువదాఱగుసంఖ్యఁ జెలంగి
యొప్పెడున్, సగణితయిర్వదాఱునగుఛందములన్ సమ
పాదవృత్తముల్.

గద్యము. ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహామధుక
రాయమానకవిజనాశ్రయ శ్రావకాభరణాంకవిరచితం బైన
కవిజనాశ్రయంబను ఛందంబునందు యతిచ్ఛందోధికారము.

———

1 నామమునకున్. భజసనంబులు పెనంగు వసునామయతి రెట్టి
ఱుదిన్ గాన్. 2 రమణీయమైన రమణుఁడు.

# క వి జ నా శ్ర య ము

## ఉ ద్ధ ర మా లా వృ త్తా ధి కా ర ము



క. [1]పరఁగఁగ నిరువదియాఱ
క్షరముల కగ్గలము చెప్పఁగాఁ బాదము లు
ద్ధరమాలావృత్తము[2]లై
పరఁగు లయగ్రాహి లయవిభాతి యనంగన్.

లయగ్రాహివృత్తము.

ఇం పడరఁగా భజసనంబులొకదఁ భజస
నంబులు భకారము నొడంబడి లయగ్రా
హిం బరఁగఁ జెప్పు కలశం బిడినయట్లు యగ
ణంబు కృతిమీఁద నమరుం బరహితార్థి!

లయవిభాతివృత్తము.

నసననసననంబులును సననసనసగంబులును
నెసఁగఁ గృతిపాదముల రసికతను జెప్పన్
గుసుమశరవత్సుభగ! యసదృశగుణా! వినుత
రస! లయవిభాతి యనిరసముసుకవీంద్రుల్.

* పరఁగిన. * లనఁబరఁగె.

* త్రిభఙ్గి.

ననలును ననలును ననలునునసభములును
సగయుక్తములైనన్ మృదువైనన్ బ్రస్తుతమైనన్
వనరుహాభవనిభులనఁదగుసుకవులకొనరత్రి
భఙ్గినిచెప్పున్ వడిదప్పున్ బ్రాసములొప్పున్.

లయహారివృత్తము.

పమునొకఁడు నగణములుగతుస సగణమును గురువుఁగ
గదిసి మృదుపదరచనతోదవిక్రియఁ బ్రాసా[2]
స్పదవిరతి నునుపఁ దగునది సుకవివరులు పొగడుదు
రసమబహుకృతుల విదిత లయహారిన్.

దండకలక్షణము.

అమరఁగ ననహంబులందాదిగా నొండె కాదేని నాదిన్
దకారంబు నొండె, లోనన్ దకారంబు లిమ్మై గకారావ

---

* ననననలును ససభములును సగయుక్తములైనన్
మృదువైనన్ బ్రస్తుతమైనన్
వనరుహాభవనిభ! మనమలరఁద్రిభంగిని జెప్పున్
వడిదప్పున్ బ్రాసములొప్పున్.

అని సాహిత్యపరిషన్ముద్రణము. కాని ఈలక్షణము సంస్కృతాంధ్ర ఛందస్కారుల త్రిభఙ్గి లక్షణములతో సంవదింపకపోవుటను లక్ష్యమైనను ప్రాచీనగ్రంథముల లభించనందునను రెండు వ్రాఁతప్రతులలో పై మేము చూపిన లక్షణముకాననగుచుండుటను లక్ష్యము ప్రాచీనుఁడు ప్రామాణికుఁడును నగు పాల్కురికి యనుభవసారమునఁ గానవచ్చుటచేతను దానినే పరిగ్రహింపనగు.

1 వాచా.

హానంబుగాఁ జెప్పినన్, దండకం బంద్రు దీనిం గవీంద్రుల్ జగద్గీతకీర్తీ! పురాకాతిమూర్తీ! సముద్యద్గుణార్థీ! సదాచారవర్తీ! వణిగ్వంశచూడామణీ! సాధుచింతామణీ! శిష్టరత్నామణీ! సుందరీవశ్యవిద్యాఖనీ! రేచనా! కావ్యసంసూచనా! నిత్యవైరోచనా!

ఇది వాదీంద్రచూడామణి చరణసరసీరుహ మధుకరాయమాణ శ్రౌనకాభరణాంకవిరచితంబైన కవిశనాశ్రయ మను ఛందంబునందు ఉద్ధరమాలావృత్తాధికారము.

---

# కవిజనాశ్రయము

## అర్ధసమవృత్తాధికారము

క. కమలాధీశుఁడు రేచన
కమలాసన కమలనాభ కమలాప్రియవృ
త్తములమహత్త్వము తేజ
స్సమేతుఁ డొనరించు నర్ధసమవృత్తములన్.

క. ఆది ద్వితీయవిలస
త్పాదంబులు వేఱువేఱుభంగుల నిడ న
ప్పాదములఁబోలఁ దక్కిన
పాదము లర్ధసమవృత్తపద్ధతి నొప్పున్.

వ. అయ్యర్ధసమవృత్తంబు లన్నవి స్వస్థానార్ధసమవృత్తములు, పరస్థానార్ధసమవృత్తములు నా రెండు దెఱంగు లయ్యె. స్వస్థానార్ధసమవృత్తము లన్నవి యుక్తాదిషడ్వింశతిచ్ఛందంబులలో నొక్కఛందంబున మొదటిపాదంబును రెండవపాదంబును మూఁడవపాదంబును నొక్కవృత్తముగా వ్యత్యాసముచేసి చెప్పునవి. మఱి పరస్థానార్ధసమవృత్తము లన్నవి మొదలిపాదంబును మూఁడవపాదంబును నొక్కఛందంబున రెండవపాదంబును నాల్గవపాదంబును నొక్కఛందంబునఁ జెప్పునవి. స్వస్థానార్ధసమవృత్తములలో—

నారీప్లుతవృత్తము.

వారస్త్రీసంసేవ్యాకృతా! మత్తాగా
కారంబు నిత్యాజగాగస్వరూపం
బారంగం బూర్వాపరార్ధంబు లైనన్
నారీప్లుతం బన్న దానామ మయ్యెన్.

రతిప్రియవృత్తము.

ఖ్యాతంబై మనజరగప్రజంబుతో సం
గతంబుగా జభసజగంబు లూర్జిత
శ్రీతస్వీప్రముదితచిత్త! చిత్తజాతా!
రతిప్రియం బనిరి తెరంబుగాఁ గవుల్.

అజితప్రతాపవృత్తము.

సజసాగ్రణాలివికసన్నవనీ
రజముఖా! నభజరవ్రజంబుతో
నజితప్రతాపకుభయార్ధములై
నిజముగాఁ దగు నానిం దిరంబుగాన్.

కోమలీవృత్తము.

జనస్తుతకీర్తి! నజాద్యగణంబుల్
ఘనంబుగా జభసరకారంబుతో
ననుపములై యుభయార్ధములందున్
జెనంగఁ గోమలి యనుపే రొప్పగున్.

వ. మఱియునుం బరస్థానార్థసమవృత్తంబులలో—

మనోహరవృత్తము.

చారిత్రనిదాన! తజాష్టములు
ద్ధరమయ్యె సకారచతుష్కముతో
నారంగఁబడ న్నుభయార్ధములన్
విరచింప మనోహరవృత్తమగున్.

మణివితానకాంతివృత్తము.

సంబుద్ధీ! మసజంబుతో గకా
[1]రంబుతో రసముల్ రంబున్నుఁ వకా
రం బొందన్ గవిరాజతోభతా
ర్గం బగున్ మణివితానకాంతికిన్.

క. ఇప్పాటఁ దొల్లి పింగళు
చెప్పినక్రియఁ దప్పకుండఁ జెలువలరంగాఁ
జెప్పఁబడె వళ్లు ప్రాసలు
తప్పక యర్థసమవృత్తతతి విదితముగాన్.

ఇది శ్రీవాదీంద్రచూడామణిచరణసరసీరుహ మధుకరాయమాన శ్రావకాభరణాంకవిరచితం బైన కవిజనాశ్రయం బను ఛందంబునందు అర్థసమవృత్తాధికారము.

---

1 రంబుఁగూడిరసరంబుతో వకా.

# కవిజనాశ్రయము

## విషమవృత్తాధికారము



క. విలసదురుకావ్యరచనా
విలసన్మతి రేచఁ డఖిలవిద్యావిదుఁ డి
మ్ముల నాదివిషమవృత్తం
బులు సెప్పు రసోత్కటముగఁ బూర్వోక్తవిధిన్.

వ. విషమవృత్తంబులలోపల స్వస్థానవిషమవృత్తంబులు, పర
స్థానవిషమవృత్తంబులు, సర్వపరస్థానవిషమవృత్తంబులు
నామూఁడు దెఱంగు లయ్యె నందు.

క. వెలయంగఁ గొన్ని పాదం
బులు వేఱుగ నొక్కఛందమునఁ జెప్పిన జా
తులఁ దగఁ గబ్బంబులను
న్వెలసిన స్వస్థానవిషమవృత్తము లయ్యెన్.

క. తనయొత్తికొన్న ఛందం
బున నందము నంద మీఁదమొనసినఛందం
బును గలయఁజెప్పిన న్మతి
వినుతపరస్థాన విషమవృత్తము లయ్యెన్.

క. వివిధవిధుల ఛందంబులఁ
జెవులకు సొగియించియుండఁ జెప్పినఁ దద్ వృ

త్తవిధిని సర్వపరస్థా
న విషమవృత్తంబు లయ్యె౯ నానావిధులన్.

అందు అంగజాస్త్ర యనుస్వస్థానవిషమవృత్తము
శ్రీరమణసంసేవ్య! భమంబుల్
సేరి సగంబుల్ చెల్వుగ రెంట౯
సారంబై మసజంబు గస్థితం
బా రెంట౯ జను నంగజాస్త్రకున్.

భ U | | మ U U U స | | U గ U } రుగ్మవతి
U | | U U U | | U U

మ U U U స | | U జ | U | గ U } శుద్ధవరాటి
U U U | | U | U | U

అందు వారాంగి యనుస్వస్థానవిషమవృత్తము.
సరోజనేత్రా! జతజల్ గగంబుల్
వారాంగికాఖ్య౯ వలనొప్పి యుండు౯
సారంబు గాఁగా తతజల్గగంబుల్
వారాంగి కంత్యంబున వచ్చు రేచా!

జ | U | త U U | జ | U | గ గ U U } ఉపేంద్రవజ్ర
| U | U U | | U | U U

త U U | త U U | జ | U | గ గ U U } ఇంద్రవజ్ర
U U | U U | | U | U U

అందు నదీప్రఘోష యను స్వస్థానవిషమవృత్తము.
ఆదిని బాదము భాద్వి రేఫావళి౯
సదుజ్జ్వలాంగా! జతజస్థ రేఫల౯

ముదంబుతోఁ దక్కినమూఁడుఁ జెప్పినన్
నదీప్రఘోషం బనునామమై చనున్.

భ U I I  భ U I I  ర U I U  ర U I U

జ I U I త U U I జ I U I ర U I U
I U I  U U I  I U I  U I I } వంశస్థవృత్తము
I U I  U U I  I U I  U I I

అందు శ్రీరమణ మనువృత్తము.

భూరిభమప్రోద్భూతసగంబుల్
నేరఁగ భాభలఁ జెందిన గా నా
ధారము గాఁ జనఁ దక్కినపూఁటన్
శ్రీరమణం బని చెప్పిరి సూరుల్.

భ U I I  మ U U U  స I I U  గ U
భ U I I  భ U I I  భ U I I  గగ U U
U I I  U I I  U I I  U U
U I I  U I I  U I I  U U

అందు శరభక్రీడ యనుపరస్థానవిషమవృత్తము.

క్షతద్విడ్వ్యాఁ శాలీ! యమనసరగశ్రీల నాద్య
ద్వితీయాంత్యస్థానప్రకరము లతిశ్రావ్యముంగా
స్థితం బైనన్ మభనయయములన్ శేషపాద
ప్రతానం బందంగా ధరణి శరభక్రీడ యయ్యెన్.

య I U U మ U U U న I I I స I I U ర U I U గ U
I U U  U U U  I I I  I I U  U I U  U

మ U U U భ U U U న | | | య | U U య | U U
మ | U U మ U U U న | | | స | | U ర U | U గ U

అందు వీణారచన యనుసర్వపరస్థానవిషమవృత్తము.

సారార్థవిచారా! తయసాగగణోక్తా
కారంబును నత్తజన భగాసమయముఁ స
చ్చారిత్రనిధీ! తజసభసత్ప్రకరము వీ
ణారచన కగుఁ భసనజరంబులందొగిన్.

త U U | య | U U స | | U స | | U గ U
త U U | జ | U | న | | | భ U | | గగ U U |
U U | | U | | | | U | | U U |
భ U | | స | | U న | | | జ | U | ర U | U

విషమవృత్తంబులలో రథగమన(మనోహర) వృత్తము.

పృథునసరజగా విపృత్తసుందరోద్యత్
ప్రథమ తృతీయచతుర్థపాదముల్ సత్పృష్ఠా
తిథి! నజజరయ ద్వితీయపాదయుక్తిఁ
రథగమనమనోహర మ్మగుఁ ధరిత్రిన్.

న | | | న | | | ర U | U జ | U | గగ U U
న | | | జ | U | జ | U | ర U | U య | U U
న | | | న | | | ర U | U జ | U | గగ U U
| | | | | | U | U | U | U U

అందు మణిదీపిక యనుపరస్థానవిషమవృత్తము.—

పరమచారిత్ర! భాసురయశ! నభానభసగణో
త్కరమునను నననల సజలన్ భకారమున్ సయుతినిసుం
దరసగారభరల్ననద్వయతన్ సయుతి నభరల్ సజమును జగల్
తిరముగా నొనగూడినన్ మణిదీపికాహ్వయమై చనున్.

న ׀׀׀ భ ᑌ׀׀ భ ᑌ׀׀ న ׀׀׀ భ ᑌ׀׀ స ׀׀ᑌ
న ׀׀׀ న ׀׀׀ న ׀׀׀ స ׀׀ᑌ జ ׀ᑌ׀ భ ᑌ׀׀ స ׀׀ᑌ
న ׀׀׀ భ ᑌ׀׀ ర ᑌ׀ᑌ స ׀׀ᑌ న ׀׀׀ స ׀׀ᑌ న ׀׀׀ స ׀׀ᑌ
న ׀׀׀ భ ᑌ׀׀ ర ᑌ׀ᑌ స ׀׀ᑌ జ ׀ᑌ׀ జ ׀ᑌ׀ గ ᑌ

మఱి యుద్గతసౌరభక మనువృత్తము.

క. ఇంబుల నుద్గతసౌరభ
కంబగు రనభ గురుగణము గలమూఁడగు పా
దంబున నయ్యుద్ధతనిల
యం బగు నననాల నొనరఁ దత్పాదంబుల్.

మనమునఁ దలఁచిన మార్గము నే
యనుచరు ననయము నడ్డకుమో
దానితల్లి వనితా యనుచో
ననె మును సకలజనాశ్రయుఁడున్,

న ׀׀׀ న ׀׀׀ స ׀׀ᑌ స ׀׀ᑌ
׀׀׀ ׀׀׀ ׀׀ᑌ ׀׀ᑌ
ర ᑌ׀׀ న ׀׀׀ భ ᑌ׀׀ గ ᑌ
న ׀׀׀ న ׀׀׀ స ׀׀ᑌ స ׀׀ ᑌ

క. సమవృత్తముల చతుష్పా
దములందుల వళ్లుప్రాలు తప్పక యామా
ర్గమునఁ బ్రవర్తింపనిచో
విమలయశోనిలయ! విషమవృత్తము లయ్యెన్.

ఇది శ్రీవాదీంద్రచూడామణి చరణసరసీరుహామధుకరాయమాణ కవిజనాశ్రయ శ్రావకాభరణవిరచితంబైన కవిజనాశ్రయం బనుఛందంబునందు విషమవృత్తాధికారము.

# కవిజనాశ్రయము

## జాత్యధికారము

క. శ్రీకాంతాసఖుఁ డాకాం
తాకాంతనితాంతకాంతుఁ డగు రేచనవాక్
శ్రీకమనీయుఁడు సకలక
లాకుశలుఁడు చెప్పె జాతిలక్షణ మొనరన్.

క. జాతులు మాత్రాసమక
ఖ్యాతగణప్రతతిఁ జెప్పఁ గందము లార్యల్
గీతులు మొదలగు నవి యుప
జాతులు భూతలవినూత్నజాతయశస్కా.

కందము.

క. ఆది గురు విడిన గురులే
పాదాదుల నెల్ల నిలుపఁబడుఁ గందములం
దాదిలఘు విడిన లఘువే
పాదాదుల నిలుపవలయుఁ బరహితచరితా.

క. వెలయఁగ గాభజసనలం
బులు నేసుగాని కందమున కొండుగణం
బులు చొరవు వాని పాదం
బులనిడునవి మూఁడు నేసుమూఁడున్నేనున్.

క. హిమకరపురశరనగముల
సమరుపఁగాఁ జనదు జగణ మందలి రెండ
ర్ధములన్ నల మొండె జకా
ర మొండె నాలవ యెడం గిరణము గానలయున్.

క. కందము త్రిశరగణంబుల
నందును గాభజసనలము లై పను నె గణముల్
పొందును నాఱిట నలజము
లొందుం దుది గురువు జగణ మొప్పదు బేసిన్.

క. నెల వెఱిఁగి నిడుదపాదం
బుల నాలవగణము మొదలఁ బొదలఁగ నిడఁగా
వలయును వ ళ్లా పాదం
బుల తుద గురు వమరఁ గందమున కిడవలయున్.

ఆర్య.

క. క్రమమునఁ గందము రెండ
ర్ధముల తుదన్ గురువు లుంచి తప్పక కడయ
ర్ధము నాలవయెడ లఘు విడ
నమితగుణైశ్వర్యధుర్య యది యార్య యగున్.

గీతి, ఉపగీతి, ఉద్గీతి.

క. అమరఁగ నార్యాపూర్వా
ర్ధము నన చెప్పినది గీతి తత్క్రియ నపరా
ర్ధమున నుపగీతి తద్వ్యత్
క్రమమున నుద్గీతి యగు జగద్గీతయశా. *

*ఇది కందజాత్యధికారము. అని ఈ పద్యమునకు తరువాత నొక వ్రాత ప్రతిలో నున్నది.

తెనుఁగు జాతులు.

క. వెలయంగఁ దెనుఁగుబాసకుఁ
దలమయ్యెడు సీసములు మొదలుగా దరువో
జలు గీతియలును నక్కర
ములు ద్విపదలు రేచఁ డిష్టముగ నొనరించున్.

సీ స ము లు.

క. ధాత్రిం గవిత్వతత్త్వము
పాత్రతఁ గడునొప్ప వెలయఁ బ్రాజ్ఞులచేతన్
మాత్రోక్తి నష్టగణముల
మాత్రము సీసముల కెల్లి మల్లియ రేచా.

క. నల నగ సల భరతలలో
పలనాలును మీఁద రెండుపద్మాప్తగణం
బులుగా నాలుగుపదములఁ
జెలువగు నొకగాలితోడ సీసంబమరున్.

సీసంబులన్నవి విషమసీసంబులు, సమసీసంబులును నన రెండు తెఱంగు లయ్యె నందు. విషమసీసం బెట్టిదనిన.

*ఉ త్సా హ.

ఊహ నేడ కాగహగణ మొండెనగణ మొండెద
త్సాహచర్య మొండె గురుకసహితముగ నొనర్పను

*ఊహ నేడుగణములుగను నొనర నగణ మొండెఁద
త్సాహచర్య మొండె గురుకసహితముగ నొనర్పను
త్సాహమయ్యె నిదియుఁ బ్రశస్తముగ నొనర్పను
శ్రీహితోరుచరిత! యదియ విషమసీసమై చనున్.

త్సాహమయ్యె గతియున్నది ప్రశస్తముగ నొనర్పను
ర్వీహితోద్ధచరితయిదియెవిషమసీసమైచనున్.

గీ. ప్రాలు వళ్లు లీలనొలిననిలిపి యా
గణమెకాని రెండుగణములిడక
నభిసుతార్థరచనయభినుతమైయుండఁ
జెప్ప విషమసీసమొప్పుఁ గృతుల.

వ: ఇట్టి సీసంబు లన్నవి అవకలిసీసము ప్రాససీసము అక్కిలిప్రాససీసంబు, వడిసీసంబు, అక్కిలివడిసీసంబునా నేను తెఱంగు లయ్యె.

అవకలిసీసము.

పాదంబు నాలుగుపాదంబులుగఁజేసి
మొదలి మూఁడిటికిలోకవిదితమైన
నలనామ గణములువెలయ నిర్మాంఁడిడి
మానుగాఁ దక్కినవానియందు
నగణముల్ రెండిడితగఁ గూడఁ బాదముల్
నాలుగు నిప్పాటనోలి నిలిపి
సమసీసములఁ జెప్పదమరంగ రెంటికిఁ
బ్రాసముల్ వేఱుగాఁజేసి యొనర

ఆ. సలలితముగ నిట్లువిలసత్పదంబుల
రసికమైనరచన లెసగియుండఁ
కవిజనాశ్రయాంకుఁడవకలిసీస మి
ప్పాటఁ జెప్పఁ బనిచెఁ దేటపడగ.

ప్రాససీసము.

ప్రాసంబు నాలుగుఁ బాదంబులందును
పన్నుగా నిడి పెఱఁ బాదములను
ప్రాసంబు లిడక తత్పాదంబులం దెల్ల
పన్నుగ వళ్లిట్లుఁ బరగ నిలిపి
దేసితెనుంగులఁ దియ్యనినోడువుల
నెల్లంబుగా నర్థదృష్టిఁ దెలుపు
ప్రాససీసము; దీనిఁ బశ్చిమార్ధంబున
ప్రాసంబు వేఱొకఁ ప్రాసమైన

ఆ. శ్రీసమేతుఁడైనఁ శ్రీపాదపంకజా
వాసమధుకరుండుఁ వాసవప్ర
హాసభాసి రేచఁడనుపండితుం డిట్లు
ప్రాససీస మరసిఁ పరఁగఁ జెప్పె.

అవకలి వడిసీసము.

వివిధచతుఃషష్టిఁ విద్యల నజుఁ డని
వినతనయోపాయఁ విమలబుద్ధి
నమరేంద్రసుతుఁ డనిఁ యధికతేజంబున
నాదిత్యుఁడని సుందరాంగయుక్తి
నంగజుఁ డని నీవిఁ నంగాధిరాజని
యలవున నభిమన్యుఁ డనిఁ సమస్త
జనులు ముదంబునఁ శ్రావకాభరణాంక
సత్కవి కవిజనాశ్రయగుణాంకుఁ

గీ. బొగడుచుండుదు రసి యిట్లు పూర్వరచన
నలరఁ జెప్పిన నది సీసమయ్యె దీని
పశ్చిమార్థంబు వడి యొండు పాట నిలుప
నదియె నవకలి వడి సీసమయ్యెఁ గృతుల.

సీ. వృత్తంబునకు బలె వెలయు నాల్గడుగుల
వెస ప్రాసముల నిల్పి విరతు లునుప
ప్రాసపీసంబగు; పశ్చిమార్థము నిట్లు
భాసిల్ల నవకలి ప్రాససీస
మమరు; ముక్తాగ్రైక్యోన్న యతిపాదముల నెల్ల
నడరిన వడిసీస మనఁగఁ బరగు
నర్థ మర్థమునకు యతులు వేఱై రచన
చెప్ప నక్కలి వడి సీసమయ్యె

గీ. నవకలికి నిట్లు ప్రాసంబు ఁతి యిల్లు
యతులు ప్రాసంబు లిష్టసంగతుల నడువ
నదియె సమసీస ముత్సాహ తుదను గీతి
పరగ విషమసీసంబగు భాను తేజ!

తరువోజ.

నలనామగణము లొనగణంబుతోడ
నాలుగుగాఁ జేసి నాటించి యిట్లు
కలయంగ నెనిమిది గణములై రెండు
గణములతుది యతిగా నిల్పి తుదల
వెలయంగఁ బాదముల్ విరచింపవల్లు
వేఱ్వేర నిప్పాట విదితమైయుండ

సలలితగతిఁ గృతిరచనఁ జెప్పఁ డనియె
జానుగాఁ గవిజనాశ్రయుఁడు దర్వ్యజ.

మఱిగీదియలన్నవి విషమగీదియలు సమగీదియలు నని రెండుతెఱంగు లయ్యె నందు విషమగీదియలు ఎత్తుగీదియ, ప్రగీదియ, మేలనగీదియ యనంబరఁగె నందు—

ఎత్తుగీదియ.

శ్రీదయితాధిపాన
యోదయనలినన్త్ర
యోదితమైన నెత్తు
గీదియ యొప్పఁ గృతుల

అందు ప్రగీదియ.

మూండునేసినగణములు రెండునలములు
మూండినగణములును రెమొగి నహంబు
పొందిగాఁగ నర్థమున కగు మీఁద ని
ట్లుండఁ జెప్పవలయునొగిఁ బ్రగీతి

అందే మేలనగీదియ.

ఒనర నేడరైన గణములొప్ప బెరసి యుండ
ఘనతరముగ వళ్లో నిట్లు గలిసియుండ నిలిపి
వినుత మేలన మను గీతి వి స్తరంబుగాఁగ
జననుతుండు సెప్పె వరవిశాలకీర్తియుతుఁడు

సమగీదియలలోఁ దేటగీదియ—

* తే. నాలుగడుగులను న నల సల న నంబు
లోలినిలిపి మూఁడగుకడనొండెవళ్లఁ
బ్రాలునిడియుండె జెప్పిన వస్తుకవిజ
నాశ్రయా! తేటగీదియ యగు ధరిత్రి.

ఆటవెలది. న న న నల నగమ్ములొనర నొక్కపా
దంబు నగణపంచకంబుగూడ
నవులదానియవల నదియును నట్లుకాఁ
జెప్పనాటవెలఁదియొప్పుఁగృతుల.

అక్కరలు—

క. వినుత ద్విత్రిచతుర్గుర
జనితగణంబులు రవీంద్రచంద్రాఖ్యములై
చను నక్కరజాతుల కె
ల్లను నాదిమగణము మొదల లఘు విడవలయున్.

---

*ఇనగణత్రయంబు నింద్రద్వయంబును
హంసపంచకంబు నాటవెలఁది
సూర్యుఁ డొకనిమీఁద సురరాజు లిద్దఱు
దినకరద్వయంబు తేటగీతి.

అని యీ పద్యము తేటగీదియ యాటవెలఁదులకు లక్షణముగావ్యవహృత మగుచున్నది. కాని ప్రాచీనలాక్షణికరీతిని లక్షణప్రబోధకముగ నుండుటను, యతిస్థానకథనమునను వ్రాతప్రతిలో లభ్యమైనందునను పై లక్షణములు గ్రహింపబడినవి. ఇట నగణమన సూర్యగణము. నలమన ఇంద్రగణము అని తెలియవలెను.

అవి మహాక్కర, మధ్యాక్కర, మధురాక్కర, అంత రాక్కర అల్పాక్కర, అను నేను తెఱంగు లయ్యె అందు.—

మహాక్కర

అమరఁ బ్రావళ్లు రెండునాఁ జెలఁగి నాఁ
లగుచోట విరతి యాదిత్యుమీఁద
నమరపతి రెండు మూఁడునా లైదునా
అగుతావులను నిల్పి సొబగుమీఱ
నమరఁ జేయుచుఁ జంద్రు నేడగుచోట
నదికిన యేడుగణములలోనఁ
గ్రమముతప్పక యప్పాట బెద్ద య
క్కర యొప్పఁ గవిజనాశ్రయుఁడు సెప్పె.

మధ్యాక్కర.

సురరాజు సురరాజు గూడిసూర్యుతోఁ గూడఁబడి మఱియుఁ
గర యొప్ప నిప్పాట నాఱు గణముల మధ్యాక్కరంబు
విరచింపఁ బంపెఁ బ్రావళ్లు వెలయఁ గవిజనాశ్రయుండు
సురుచిరంబుగను సుశబ్ద శోభితం బగునట్లుగాఁగ.

మధురాక్కర.

రవిదివిజరాజగీర్వాణ రాజదేవాధిదేవ
కువలయప్రియులిప్పాట గూడ నేను గణములు
నవిరళముగఁ బ్రావడి మధు రాక్కరంబు ధరలోనఁ
గవిజనాశ్రయుఁ డెఱిఁగించెఁ గవుల కింపు జనియింప.

అంతరాక్కర—

* ఇనుఁడొకఁడు సురేంద్రయుగ । మిందుఁడొక్కఁడుం
బొనరియుండఁ బ్రావళ్లు । పూర్వంబుగాదు
ననఁగ నాల్గింటయతి త్రి । కాంత్యంబువర్ణ
మనుపమానాంతరాక్క । రాఖ్యంబు రేచ!

అల్పాక్కర.

ఇంద్రుండు మఱియొక్క । యింద్రుఁగూడి
చంద్రుతో నొడఁబడి । చనినసత్క
వీంద్రు లల్పాక్కరం । బిదియందురు
చంద్రాస్య కవిజనా । శ్రయకవీంద్ర.

ద్విపద.

ఇంద్రగణములు మూఁడినగణం బొకటి
చంద్రాస్య ద్విపదకుఁ । జనుఁ జెప్ప రేచ.

త్రిపద.

త్రిదశేంద్రు లాఱగు పదియగు నెడనకుఁ
గదియ రెంటను మూఁటను
నడుకుడుఁ ద్రిపదకు నమరు.

---

* ఇనసురేంద్రచంద్రంబు లిప్పాటవచ్చి
పొనరి యుండంగఁ బ్రావట్టు పూర్వభంగి
ననగణంబులు నాలుగిం టం బెనంగ
ననుపమానాంతరాక్కర మయ్యె రేచ.

చౌపద.

నలగా భసలను ॥ నాల్గిటిలోనన్
వలసిన నాలుగు ॥ వడిగాఁ బూనన్
వెలయ గణద్వయ॥విశ్రమ మైనన్
అలవడుఁ జౌపద ॥ కన్వితమైనన్. 32

షట్పదము.

త్రిదశేంద్రగణములు వెలయ నిర్మూఁడిడి
కదియ నంత్యంబునఁ జంద్రుఁ గూర్చి
తుది యిట్లుగా మదిఁ జెప్పిననదియ ష
ట్పద మగు మల్లియ రేచ నాఖ్య. 33

గద్యము. ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహామధు
కరాయమాన శ్రావకాభరణాంకవిరచితం బైనకవి
జనాశ్రయ మనుఛందంబునందు జాత్యధికారము.

———

# కవిజనాశ్రయము

## షట్ప్రత్యయాధికారము



క. [1]శ్రీనారీప్రియుఁ డఖిలబు
ధానందకరుండు కవిజనాశ్రయుఁడు ధరి
త్రీనుతుఁడు సమస్తకళా
నూనుఁడు షట్ప్రత్య[2]యముల నొగి నెఱిఁగించున్. 1

క. క్రమమునఁ బ్రస్తారము న
ష్టము నుద్దిష్టమును వృత్తసంఖ్య యనంగా
నమరు లగక్రియ యన న
ధ్వము నన షట్ప్రత్యయములు దనరుఁ గృతులన్. 2

క. ఇడి గురువుక్రింద లఘువ
క్కడ సదృశము సేసి పిఱుఁదఁ గదియఁగ గురువం
దిడఁ బ్రస్తారము రెండిడి
మడుప నగును వృత్తసంఖ్య మల్లియరేచా! 3

క. ధరవృత్తసంఖ్యలో సవ
మురువుఁ జేసి సనగూడు నొక్కఁడు లఘువుల్
గురువులు సమవిషమంబుల
విరచింపఁగఁ జెడిన యట్టి వృత్తము వచ్చున్. 4

---

1 శ్రీనారీప్రియకరుఁ డఖిలానందకరుండు.....2 యంబులొప్పఁ
గఁ జెప్పున్.

క. ఒక్కటి మొదలిడి మడుపుచు
నక్కడ తుదదాఁక లఘువు లంచలిలెక్కల్
లెక్కించి కూడి పదపడి
యొక్కటి మఱియందుఁ గూడ నుద్దిష్టమగున్. 5

క. తరతరముదొంతి వృత్తా
క్షరములు లెక్కాదికంబుగా నిల్పి యధో
క్షరము లుపర్యక్షరములు
పరువడి గూడుచు నుపాంతపర్యంతముగాన్. 5

క. కలయనుపాంతాధోక్షర
ము లుపాంతములందు నిల్పి మును కూడిననొ
క్కలగ క్రియ తప్పిండిత
మలవడసద్వృత్తసంఖ్య మల్లియ రేచా!

క. అగుసధ్వ మేకరహిత
ద్విగుణితసంఖ్యాంగులీకృతి వ్యాపకమి
ద్ధగుణాఢ్య! కవిజనాశ్రయ!
జగజ్జనాధారధీరచాపుచరిత్రా!

ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహామధుకరాయమాన శ్రావకాభరణాంకవిరచితంబైన కవిజనాశ్రయ మను ఛందంబునందు షట్ప్రిత్యయాధికారము.

---

# కవిజనాశ్రయము

## దోషాధికారము

క. శ్రీశ్రితవత్సుఁడు విద్యా
శ్రీశ్రితముఖుఁ డఖిలజనవిశేషితకీర్తి
శ్రీశ్రితభువనుఁడు సుకవిజ
నాశ్రయుఁ డెఱిఁగించుకృతుల నగుదోషంబుల్

క. రూపిత పునరుక్తివ్య
ర్థాపార్థవిసంధి సంశయచ్ఛందోభం
గాపక్రమ యతిభంగవి
రూపోక్త్యపశబ్దములు విరోధము కృతులన్.

క. అని యిట్లు దశవిధములగు
మునిమతమున కావ్యదోషములు వాని నెఱుం
గనివాఁ డెప్పాట నెఱుం
గు నుదాత్తకృతిప్రసంగ గుణదోషములన్.

క. మునుసెప్పినశబ్దమె చె
ప్పనేని కొఱఁతలేక శబ్దపునరుక్తి యగున్
మునుసెప్పిన యర్థమె చె
ప్పనేని కొఱఁతలేక యర్థపునరుక్తి యగున్.

క. దినకరుఁడని మఱిదినకరుఁ
డనఁగా శబ్దపునరుక్తి యనఁ జనుఁ గృతులన్
దినకరుఁడని యాదిత్యుం
డనఁగా నర్థపునరుక్తి యనిరి కవీంద్రుల్.

క. అయనయసమేత! కమనీ
యయశా! పునరుక్తియయ్యెనమరుఁ బదావృ
త్తియు మఱి వీప్సాభీక్ష్ణ్య
క్రియాసమభిహారమైన క్రియలన్ గృతులన్.

క. తనసత్యము తనశౌచము
తనశౌర్యము తనవిశేషదానము చతురా
ననునకుఁ బొగడఁగ మిక్కిలి
యని యీక్రియఁ జెప్పినది పదావృత్తి యగున్.

క. విను వసతి వసతి దప్పక
వన మనఁగా వీప్స వచ్చి వచ్చి చనుం డా
ననఁగను నభీక్ష్ణమిమ్మి
మ్మనఁగాఁ గృతులన్ గ్రియాసమభిహారమగున్.

క. మొదలి క్రియతో సమర్పక
విదిత విరుద్ధార్థయుక్తి విపరీతంబై
తుదఁ గ్రియరాఁ జెప్పిన వ్య
ర్థదోషమని రఖిలకావ్యతత్త్వవిధిజ్ఞుల్.

క. పొడిచి యొడువంగ బగఱను
కడుకరుణాపరుఁడ వీవు గావున నీక

గ్గెడువారు లేరు పగతె
క్కడ నని యిప్పాట చెప్పఁగా నర్థమగున్.

క. తనకడకు వలచి యేఁబో
యిన నొల్లం డొల్లఁ డింక నే నాతనిఁ గా
మిని గవయ నేమినోఁచితి
నన విరహిణి కమరు నీక్రియలు వ్యర్థములై.

క. వన మిదియ కంటె తోఁడ్పడు
మన వన మనియొండు రెండు మదుఁగులుఁగాఁ జె
ప్ప నపార్థదోషమగునది
చను మత్తోన్మత్తబాలచరితములందున్.

క. తలరమి నీతో మేరువు
అలవి యగుంగాక యొరులు అలవియె వరఉ
జ్జ్వలతేజ యనఁగ సంధిం
గలయని నొడువులు విసంధికము లనఁబరఁగున్.

క. ప్రియమున నే నిన్ను మనః
ప్రియుపాలికిఁ బుచ్చఁబోయి బింబాధర! పా
డియొ యిట్లు చేయనని సం
శయార్థముగఁ జెప్పఁ గృతులసంశయమయ్యెన్.

క. భూభాగనభోభాగది
శాభాగప్రవర్తికీర్తి సత్కృతికృతి చ్ఛం
దోభంగ మిట్లుగా ఛం
దోభంగం బను ప్రధానదోషం బయ్యెన్.

క. దినకరుఁడును హిమకరుఁడును
మనసిజుఁడును బోల్ప నీసమానులు సత్కాం
తి సుదాత్తతేజమున సొబ
గున ననిన నపక్రమం బగుఁ గృత్యక్రమమై.

క. విసుతచ్ఛందంబునఁ జె
ప్పినయెడ నిలుపక కడలను ఁ దప్పి నిలుచుచో
ప్పునఁ జెప్పిన నది యతిభం
గనామదోషమగుఁ గృతి జగజ్జనవినుతా!

క. వెలయఁగ లక్ష్యలక్షణ
ముల సిద్ధములైన శబ్దములుగాని కుసం
ధులు మొదలైనవిరూపో
క్తు లెల్ల నపశబ్దనామదోషము లయ్యెన్.

క. పరఁగ నికారోపరితత్
స్వరమ యికారంబుతోడసదృశముఁగా నె
వ్వరి యిల్లిది యిట్లన కె
వ్వరిల్లి దిట్లనఁ గుసంధివర్గం బయ్యెన్.

క. స్వరగణముకూడి కృతిఁ ద
త్స్వరమైన నకార మొంది ఁ వ్రాలై చనఁగా
దొరవీవు నజుఁడు ననకయ
దొరవీవు న్నజుఁడు నననదుస్సంధి యగున్.

క. నుడువులకు సంధి నెగ్గులు
పొడమిన శ్రుతిదుష్టమయ్యె ఁ భూతలమున ని

చ్చెడు నెడ నిను మడిసిరి యనఁ
బడు నీజోడనినఁ జుట్టుస్రావగుఁ గృతులన్.

క. తుద వేఱుసేసి మఱిచ
క్కఁదవుం దెనుఁగున నమర్చి కలనంబుజముల్
పదియు ననక కలనంబుజ
పదియని కృతిఁ జెప్ప వైరిపవ మనఁబరగున్.

క. వెలయఁగఁ జెఱాకు విలుగొని
యలరమ్ములఁ జేతఁ బట్టి యంగజుఁడు విరా
హులనేయు నేర్పుకడిమిఁ
దోల మెలయఁగ ననినఁ గాకుదోషం బయ్యెన్.

క. ఈతడు "నృపస్యనగరం
యాతి"యనం జనిన సుప్తిఙంతంబులు కృ
త్వాతీర్త్వాజిత్వా యన
బ్రాతిగ నీక్రియలు సొరవు భాషాకృతులన్.

క. వితతసుకవివాక్యం బవ
గతమై కవయోవదంతి కావ్యం బని స
త్కృతినీక్రియఁ బెట్టించిన
నతిశయమైయుండు సుప్తిఙంతంబయ్యెన్.

క. ఇవి మొదలగు నొడువు లనే
కవిధగ్రామ్యోక్తు లెన్ని కలవన్నియు స
త్కవు లపశబ్దములని త
త్కవితల మెచ్చరు కవీంద్రకల్పమహీజా.

క. శ్రీదేవీపతి రేచఁడు
గాదిలియై చనఁగ దేశకాలకళాలో
కాదివిరోధస్థితుల స
మాదరమునఁ దెలియఁ జెప్పె నఖిలజనులకున్.

క. కలహంసలు క్రోష్టామిడి
తలిపలలోఁ గోకిలాళి తామరవిరిపు
వ్వులలో నాడెడు నను ను
క్తులు దేశవిరోధనామదోషము లయ్యెన్.

క. చినికెడుఁ బురినెమిళులు ముద
మునఁనాడెడు నింద్రగోపములు పాటెడు నా
మని కాల మయ్యె నిలలో
ననఁ గాలవిరోధదోషమనిరి కవీంద్రుల్.

క. అసమగజము లందలములు
కొసమాత్రకుఁ దెచ్చు నట్టి గుఱ్ఱంబుల నం
కుస మిడక యెక్కె ననఁగా
హాసనీయకళావిరోధమనిరి కవీంద్రుల్.

క. విను కరహీనుఁడు తగ వ్రా
సినపాత్తము తెచ్చి యొక్క చెవిటి వినఁగ బో
రనఁ జదివె మూఁగ సభలో
నన లోకవిరోధదోష మనిరి కవీంద్రుల్. 31

క. ఘనదండకాష్టకృష్ణా
జినములు సొగయింప నొక్కజినముని చనుదెం

చె ననఁగ సమయవిరోధం
బని కవులకుఁ జెప్పెఁ గవిజనాశ్రయుఁ డొనరన్.

క. జినసుతధర్మమహింసయ
యనుమతమున వితతముగ గజాసురుఁ బాపం
బని చంపఁ డయ్యె నీశ్వరుఁ
డన నిది యాగమవిరోధమనిరి కవీంద్రుల్.

క. అని యిట్టివి దశ దోషము
లనఁ జనుఁ గృతి నివియ వెండి యతిశయతరమై
చనుఁ గొన్ని యెడల ధీరుల
మన మలరఁగఁ జెప్పిరేని మల్లియరేచా!

క. జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియరేచన సుకవిజనా
శ్రయుఁ డీఛందంబుఁ జెప్పెఁ జనులకుఁ దెలియన్.

గద్యము. ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహమధుకరా యమాన కవిజనాశ్రయశ్రావకాభరణాంకవిరచితం బైన కవిజనాశ్రయమను ఛందంబునందు దోషాధికారము.



# ప్రక్షిప్తములు

## సంజ్ఞాధికారము



### గణాధిదేవతలు

క. మ భ జ స న య ర తగణముల
కభిమతముగ భువియు శశియు నర్యమపవనుల్
ఋభునిలయ సలిలపావక
నభములు దేవతలు బుధజనస్తుత రేచా!

### గణఫలములు

క. సరసాన్న రుచిరభూషణ
పరితాప స్థానచలన బహుదుఃఖ రుజా
పరమాయు రచలలక్ష్మీ
కరములు మ య ర స త జ భ నగణములు వరుసన్.

### గణవర్ణములు

క. గారుత్మత గోరోచన
సారంగ పిశంగ కుముద చందన రక్తాం
భోరుహ కనకప్రభలను
నారయ మగణాది యగుగణావలి వొల్చున్.

కవిజనా—శ్రయము

## గణగ్రహములు

క. ధరణిజ శశి రవి బుధ గురు
సురరిపుగురు మంద ఫణులు సొరిది గ్రహంబుల్
పొరి మ భ జ స న య ర తగణ
సరణికి ఛందోమతంబు చర్చింపంగన్.

## గణకులములు

క. మగణంబు శూద్రకులజము,
భగణం బగు వైశ్యజాతి, బ్రాహ్మణజాతుల్
సగణయగణములు, రగణము
జగణము నృపజాతి, యంత్యజంబులు నతలున్.

## గణగోత్రములు

ఆ. కాశ్య పాత్రికపిలకౌశికవాసిష్ఠ
గౌతమాంగిరోజకణ్వమునుల
గోత్రముల్ ప్రసిద్ధపాత్రముల్ మగణాది
నెన్నఁబడిన గణము లెనిమిదికిని.

## గణోత్పత్తి

ఆ. చంద్రవహ్నిసూర్యచక్షుఁ డౌరుద్రుని
మూఁడుకన్నులందు మూఁడుగురువు
లుదయ మయ్యె; దాన నొప్పారె మగణంబు,
నందు సప్తగణము లమరఁ బుట్టె.

క. భగణము సగణము నగణము
తగణంబు మరుద్గణములు తనరంగ మను

పశ్యగణంబులు జయగణములు
మగణంబును రగణ మరయ మహి రాక్షసముల్.

## గణనక్షత్రములు

తే. జ్యేష్ఠమృగశిరయుత్తర చెలఁగు స్వాతి
సరవి రేవతి పూర్వాషాఢ కృత్తి
కయును బుష్యమి యనెడునక్షత్రపంక్తి
కనియు మ భ జ స న య ర తగణములకును.

## గణరాసులు

క. అలి వృషభ సింహ తుల యుగ
జలచర చాపాది కటక సంజ్ఞకరాసుల్
లలి మ భ జ స న య ర తగణ
ముల కయ్యెను జగతిలోను మోహనరూపా.

## గణయోనులు

ఆ. హరిణ సర్ప వృషభ హయరిపు కుంజర
మర్కటాజ చారు మహిషములును
మలసి యోనులయ్యె మ భ జ స న య ర త
గణసమూహమునకు గుణగణాఢ్య.

## గణగుణదోషవిచారము

తే. మొదల సంయుక్తవర్ణంబు పొందె నేని
మఱవ కారెంటికిని గ్రహమైత్రి వలయు;
నిది విచారింపరేని కృతీశ్వరుండు
పిడుగు మొత్తినగతిఁ గూలు బిట్టబిట్టు.

క. మగణం బెప్పుడు శుభగణ
మగు, నెన్నం గ్రూరగణము మఱి డాసినచోఁ
దెగఁజంపు, బుధుఁడు క్రూరం
బగుగ్రహముం గదిసి క్రూరుఁడై చనుమాడ్కిన్.

క. మగణంబు పద్యముఖమున
సగణముతోఁ గూర్చి చెప్పఁ జనుఁ గృతి యొండెం
దగుపద్య మొండెఁ గర్తకు
యగణాంతము చెప్ప శుభము లయ్యెడుకొలకున్.

క. మభనయలు పద్యముఖమున
శుభ సుఖ ధన జయము లొసఁగి సొం పొనరించుం
బ్రభునాశము జతరస లని
సభలం బద్యాది నిడఁగఁ జన దెయ్యెడలన్.

క. నయలం జెప్పిన శుభ మగు,
జయలం జెప్పినను బతికి జయకీర్తు లగున్,
మయలం జెప్పిన సౌఖ్యము
రయలం జెప్పినను జెట్ట రయమున వచ్చున్.

క. పొగడొందఁ బద్యముఖమున
రగణము యగణమును గూడి రాగిల్లిన నీ
జగమంతయు నేలెడువాఁ
డగుఁ గృతిపతి విభవయుక్తుఁ డగుఁ గవివరుఁడున్.

క. రసలం జెప్పినఁ జి చ్చగు
జసలం జెప్పినను దెవ్వలు చయ్యన వచ్చున్
తసలం జెప్పిన మే లగు
మసలం జెప్పినను గర్త మండల మేలున్.

క. మునుకొని పద్యముఖంబున
నవిలగణం బిడిన నాయురారోగ్యంబుల్
కొనసాగు, దానిముందట
ననలగణం బిడినఁ బతికి నలజడి సేయుఁన్.

క. తగణంబు తొలుతఁ బిమ్మట
భగణంబును గదిసి యుండఁ బద్యము హృద్యం
బుగ రచియించినఁ గర్తకు
నగణితముగ నొసఁగు నాయురైశ్వర్యంబుల్.

క. నగణంబు గదిసి శుభకర
మగు యగణము గూడి యొసఁగు నర్థము సిరులున్
నగణయుత మైన భగణము
జగణంబును గూడి భాగ్యచయముల నిచ్చున్.

క. రజతలఁగూడిన నూరక
గజిబిజి గావించుఁ, గావ్యకర్తకు సంప
ద్విజయములఁ జేయు భగణము,
నిజముగ నయరసల డాసి నిలిచినచోటన్.

క. సభలం జెప్పిన విభవము
రభలం జెప్పినను జెట్ట రయమున వచ్చున్
శుభ మగు రయలం జెప్పిన,
నుభయము వర్ధిల్లునందు రుత్తమచరితా!

క. రాజిన కాదిన్ మగణము
నోజం గదియించి సుకవు లొసఁగెడి పద్యం

బాజులజయ మిం జాలదె
తేజులు నేనుఁగులు భటులుఁ దేరులు సేనల్.

క. అనిలానలసంయోగం
బనుపమకీలాకరాళ మగువహ్నిభయం
బొనరించుఁ గర్తృగృహమున
కనుమానము లేదు దీనినంద్రు కవీంద్రుల్.

క. తగణంబు గదిసి చంపును,
రగణము దా భీకరంపు రణ మొనరించున్,
సగణం బిఁకనొకచిత్రము
మగణముతోఁ గూడఁ గాలమానము పలికిన్.

క. అగిని గణంబున కిరుదెస
సగణముతోఁ గూర్చి చెప్ప సత్కవి మదిలో
నగి యైనఁ దిట్టి యైనను
బగనము గాకుండఁ గమలభవుఁడో శివుఁడో ?

క. ఏగణముఁ గదిసె వగణం
బాగణము సమస్తముఁగళావాప్తం బై
రాగిల్లు నినుము పరుసపు
యోగంబునఁ బసిఁడివన్నె నూనినకరణిన్.

## అక్షరగుణదోషవిచారము

క. శ్రీకారము గలపద్యము
ప్రాకటముగ లచ్చియొసఁగి పతి కనవరతా
స్తోకజయము లొనగూర్చును
మాకరుణారక్షితాంగ మల్లియరేచా!

క. పాఫాబాభామాలను
పాపాక్షరసంజ్ఞ లేనుఁ బద్యము మొదలన్
రూపించి నిలిపి చెప్పిన
నాపద్దశలను మూల నండ్రు కవీంద్రుల్.

క. ఇలఁ దగణ రగణ జగణం
బులు పురుషగణములు, భగణమును యగణంబు
లలనాగణములు, నగణము
పొలుప మగణ సగణములు నపుంసకగణముల్.

అక్షరనిర్ణయము

క. ఆదులు పదియే నన(గాఁ
గాదులు దా నిరువదేను గణుతింపంగా
యాదులు పది యనిచనఁగా
నీదెస నక్షరము లమరు నేఁబది యనఁగన్.

బీజాక్షరములు

సీ. అ ఇ ఉ ఋ ౡ ను నైదు నాదీర్ఘవర్ణంబు
లైదు నేకారాదు లైదు నిలిపి
వరుసగ వర్గాదివర్గపంచకమును
యాదు లైదుమ షాదు లైదుఁ గూడఁ
బదివర్గముఁల వర్ణషట్కుల నొండొంటి
క్రిందఁ బొందఁగ నిల్ప నందులోనఁ
బ్రథమాక్షరంబులు పవనబీజంబులు
నవలివి దహనబీజాక్షరములు

గీ. అవనిబీజంబు లగుఁ దృతీయాక్షరములు
వరుణబీజంబు లగుఁ దరువాతిపదియు
గగనబీజంబు లై దవకడల వెల్ల
వాని మేలును గీడును వలయుఁ దెలియ.

మ. క్షితిబీజంబులసంపదల్ పొసలుఁబోషించుంబయోబీజము
ల్సతతంబుం బ్రమదంబొనర్చుశిఖిబీజంబుల్మృతుం జేయుమా
రుతబీజంబులు శోకవారిధిఁ బడంద్రోచు న్నభోబీజముల్
పతినత్యంతదరిద్రుఁ జేయు మొదలంబద్యాలి నొందించినన్.

అఖండయతి

ఉ. మానుగ విశ్రమాక్షరసమన్వితమై స్వరమాదినన్ దదీ
యానుగుణాక్షరంబె కొనిరైనను జెప్పఁగనొప్పు నీక్రియన్
భానుసహస్రభాసి వృషభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండయతి పొల్పగు నాదికవిప్రసిద్ధమై.

ప్రాదియతులు

క. ప్రపరాపసమనుసుప్ర
త్యపినిర్దురధిన్యుపాభ్యుదాఙ్న్యత్యవప
ర్యుపసర్గ వింశతికి వ
ళ్లిపరిస్వరయుక్తమైన నుభయము చెల్లున్.

బిందుయతి

క. కచటతప లనఁగఁ బరఁగిన
ప్రచురం బగునేనువర్గపంక్తుల పిఱుఁదన్

## ప్రక్షిప్తములు

రుచిరముగ బిందు వ్రాఁదిన
నచలం బై వళ్లి చెల్లు నంత్యాక్షరముల్.

గీ. జాకు వడి చెల్లు రత్నకంకణ మనంగ
ఝాకు వడి చెల్లు బర్హిపింఛం బనంగ
ణాకు వడి చెల్లుఁ గనకమండప మనంగ
నాకు వడి చెల్లు దివ్యగంధం బనంగ
మాకు వడి చెల్లు విజితశంబరుఁ డనంగ.

### ప్లుతయతి

క. దూరాహ్వానమునందు మ
హారోదనగానసంశయార్థములతుదన్
జేరువఁ దగ నాద్యచ్చుల
నారూఢిగఁ బ్లుతమువడి మహాత్త్వము మీఱున్.

### సంయుక్తాక్షరయతి

క. వరకృతులకు సంయుక్తా
క్షరములలో నెద్ది యైనఁ జను వడి యిడఁగా
గురుబుధజనవరదాయక
స్మరసన్నిభ సుభగమూర్తి మల్లియ రేచా!

### పోలికవడి

క. పోలఁగ, పుఫుబుభులకు మూ
పోలికవడి శీల ముల్లమున కౌన యనఁగా
శీలం బుల్లం బనఁ గా
భూలోకం బమరలోకమున కౌన యనఁగా.

## వృత్తాధికారము

మధ్యాఛందంబునందు—

మృగీవృత్తము.

విస్మరే
ఘస్మృగీ
ముస్మృగాఁ
జిన్మయాం.

నారీవృత్తము.

నారీవృ
త్తారంభం
బారున్మా
కారంబై.

ప్రతిష్ఠాఛందంబునందు—

కన్యావృత్తము.

పొత్తై గాఁగా
పత్తిం గన్యా
వృత్తం బయ్యెన్
జిత్తం బారన్.

గాయత్రీఛందంబునందు—

వసుమతీవృత్తము.—

అందంబుగఁదసల్
పొందున్ వసుమతిన్.

ఉష్ణిక్ఛందంబునందు—

మదరేఖావృత్తము.

కోపింపఁ దగ నసగంబుల్
ప్రాపించు మదరేఖన్.

పఙ్క్తిచ్ఛందంబునందు:—

మనోరమావృత్తము

నరజగంబులఁ మనోరమఁ
బరఁగు షడ్యతిం బఠింప నౌ.

మణిరంగవృత్తము

సప్రసాదరసాగము లొందుఁ
దీప్రభాణయతిఁ మణిరంగన్.

పంచకమలావృత్తము

పంచకమలాఖ్యఁ భయసల్గం
బంచితముగా షడ్యతిఁ జెందున్.

త్రిష్టుప్ఛందంబునందు:—

ఉపజాతివృత్తము

ఈరెండు వజ్రంబులు నిండుఁ గూడన్
సరోజనేత్రా! యుపజాతి యయ్యెన్.

మందారదామవృత్తము

ఆఱింట విశ్రాంతి యై తాతగా స్వా
ధారంబు మందారదామంబు రుద్రా!

సుముఖవృత్తము
నజజవములఁ శరవిశ్రమములఁ
సుజనసుతా! సుముఖం బెసఁగున్.

జగతీఛందంబునందు:—

పుటవృత్తము.
నగయుతయతితో నాతయుతం బై
యగణము తగ ఫాలాక్షు! పుటం బౌ.

చంద్రవర్త్మవృత్తము.
చంద్రవర్త్మ మగు పామజయతితోఁ
జంద్రజూట! రనభంబు సగణమున్.

కుసుమవిచిత్రవృత్తము.
కుసుమవిచిత్రం గోను నయయుగ్మం
బసదృశషడ్యత్యభిహిత మైనన్.

ఉజ్జ్వలవృత్తము.
స్మయరుచి తలషడ్యతి నుజ్జ్వలా
హ్వాయము ననభరావళిఁ జెందినన్.

అతిజగతీఛందమునందు:—

ప్రీతివృత్తము
సగణత్రయములఁ జగసంయుతంబుగా
నెగడు న్నిధివిశ్రమనీతిఁ బ్రీతికిన్.

సుమంగలీవృత్తము

సజసంబుతో సగము సంగతితో సా
మజవిశ్రమంబునసుమంగలి యయ్యెన్.

క్షమావృత్తము

ననతతగములన్ నవ్యభూభృద్యతిన్
వినుతమయి క్షమావృత్త మొప్పు న్మహిన్.

శక్వరీఛందమునందు:—

లోలావృత్తము

భూతేశా! మసమంబుల్ పొందంగా భగగంబుల్
స్వాతంత్ర్యక్షితిభృద్విశ్రామం బొందును లోలన్.

కమలవిలసితవృత్తము

కమలవిలసితము కలయతితోడన్
గ్రమమున ననననగగములు గూడన్.

అతిశక్వరీఛందమునందు:—

శాంతివృత్తము

ఒందుగా రజద్వయంబు లొప్పు రేఫతో జనా
నందకారి శాంతి యయ్యె నాగవిశ్రమంబుతో.

మాలతీవృత్తము

కరటివిరతి నారకాంత యాయుక్తితోడన్
మరిగి తిరిగి చెప్ప మాలతీవృత్త మయ్యెన్.

ప్రభద్రకవృత్తము

రజనిచరాన్వవాయహర! రామ! రాఘవా!
నజభజరల్ ప్రభద్రకము నవ్యదిగ్యతిన్.

చంద్రరేఖావృత్తము

సారంబై చంద్రరేఖ జంచన్మరేఫల్ మయాసం
చారంబుం జెంది పొందుఁ సప్తోదయద్విశ్రమం బై.

ఆకృతిచ్ఛందమందు:—

విచికిలస్తబకవృత్తము

శబరవికృతిధర! పురహార! సవితృవిరతి విచికిల
స్తబకమున నిరువదిలఘువులు చన లగ మొగిఁ బెనఁగున్.

వికృతిచ్ఛందంబునందు:—

పద్మనాభవృత్తము

ఎన్నంగ నీతం డనాద్యంతుఁ డంచుం బ
రీక్షింతు రెవ్వాని వాఁ డెల్లనాఁడుఁ
నన్నేలు నా నర్కవిశ్రామ మై పద్మ
నాభం బగుఁ సప్తతంబుల్ గగంబున్.

మత్తాక్రీడితవృత్తము:

మత్తాక్రీడితం బగు వృత్తం బౌఁ ద్రిదశయతి
మయమననననవముల్.



---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 23 | సభలలన్ | సభలన్ |
| 7 | 14 | దిక్క | దక్క |
| 12 | 5 | శ్రిన్ | శ్రీన్ |
| ,, | 6 | జే | జై |
| ,, | 20 | ప్రతిష్టా | ప్రతిష్ఠా |
| 13 | 8 | సుప్రతిష్టా | సప్రతిష్ఠా |
| ,, | 15 | సుందరి | సుందరీ |
| 16 | 5 | రాయమాన | రాయమాణ |
| 31 | 15 | బిడి | బడి |
| ,, | 24 | ధీరాధారతోం | ధీరాదారతోఁ |
| 32 | 18 | రాయమాన | రాయమాణ |
| 34 | 23 | సారముసఁ | సారమునఁ |
| 35 | 5 | కావ్యసంసూచనా | నిత్యధీలోచనా |
| ,, | 6 | నిత్యవైరోచనా | త్యాగవైరోచనా |
| 38 | 18 | కరాయమాన | కరాయమాణ |
| 48 | 3 | విషమసిస | విషమసీస |
| 52 | 7 | ఆటవెలది | ఆటవెలఁది |
| ,, | 21 | లక్షణపుంబోపా | లక్షణపుంబో |
| 55 | 13 | కరాయమాన | కరాయమాణ |
| 64 | 17 | యమాన | యమాణ |

6 వ పుటలోని 3 పద్యమునకుఁ దరువాత నీక్రింది పద్యమును జేర్చుకోవలయును.

క. శుభ సుఖ రుక్ క్షయ ధన కన
క భయైశ్వర్యములఁ జేయుఁ గ్రమమునఁ గావ్య
ప్రభులకుఁ గవులకు మొదలిడ
మ భ జ స న య ర తగణములు మల్లియరేచా !

# నిఘంటువులు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| వావిళ్లనిఘంటువు 1 భాగము (అ మొదలు ఔ వఱకు)... | 10 | 0 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయ కృత ఆంధ్రనిఘంటువు | 10 | 0 |
| లఘుశబ్దార్థచంద్రిక ... | 6 | 0 |
| Sankaranarayana's Telugu-English Dictionary, శంకరనారాయణగారి నిఘంటువు (తెనుఁగుపదములకు ఇంగ్లీషు అర్థముగలది) | అచ్చు | |
| Sankaranarayana's English-Telugu Dictionary, శంకరనారాయణగారి నిఘంటువు (ఇంగ్లీషుపదములకు తెనుఁగు అర్థముగలది) ... | 15 | 0 |
| English-Telugu Pocket Dictionary ఇంగ్లీషు-తెనుఁగు పాకెట్టుడిక్షనరి ... | 5 | 0 |
| సంస్కృతాంధ్రనిఘంటువు (సంస్కృతపదములకు తెనుగు అర్థముగలది) ... | 3 | 6 |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యము ... | 0 | 4 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీక, అకారాద్యనుక్రమణికతో ... | 1 | 10 |
| డిటో కాలికో బైండు ... | 2 | 0 |
| బాలచంద్రోదయము, అలఘుకౌముది ... | 0 | 8 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) ... | 2 | 0 |
| ఆనందరంగరాట్ఛందము ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, పద్యవ్యాకరణము ... | 0 | 6 |
| కవిజనసంజీవని ... | 0 | 8 |
| నేటికాలపుకవిత్వము ... | 3 | 0 |
| ప్రౌఢవ్యాకరణము ... | 1 | 0 |
| వెంకయ్యవ్యాకరణము ... | 0 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.

| | | ప్రతి 1-కి రూ॥ | అ॥ |
|---|---|---|---|
| అన్నపురీవిలాసము | ... | 0 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యనిఘంటువు | ... | 0 | 3 |
| ,, టీకతో | ... | 0 | 10 |
| ,, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, వగైరా టీకతో | | 2 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 0 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | ... | 1 | 8 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 6 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, పద్యము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| డిటో ద్విపద, నాదిండ్ల గోపమంత్రి | ... | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము, జ. వే. సుబ్రహ్మణ్యశర్మ గారిది. | ... | 0 | 12 |
| ,, గొర్తి సూర్యనారాయణశాస్త్రి గారిది | ... | 1 | 0 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 3 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము | ... | 2 | 8 |
| జైమినీభారతము | ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 3 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| దశావతారచరిత్ర పద్యకావ్యము | ... | 4 | 0 |
| ధనాభిరామము ,, | ... | 0 | 12 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 10 |
| నలచరిత్ర, ద్విపద, శ్యామలకోటైండు | ... | 2 | 4 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 10 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| నిర్వచనోత్తరరామాయణము | ... | 2 | 0 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 8 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 1 | 8 |
| డిటో వేంకటనాథ రాజకవికృతము | ... | 2 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 0 |
| ,, పాండురంగమాహాత్మ్యము | ... | 3 | 0 |
| మనుచరిత్ర, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున వేలుం గాకితముమీద ముద్రితము | | 5 | 0 |
| భాస్కరరామాయణము | ... | 3 | 0 |
| రంగరాయచరిత్రము | ... | 0 | 12 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 4 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 6 |
| రామరాజీయము | ... | 0 | 12 |
| రామాభ్యుదయము | ... | 3 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | ... | 2 | 0 |
| బిల్హణీయము | ... | 1 | 0 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము | ... | 0 | 10 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.